# చందమామ

సంపుటి 104 మార్చ్ 2001 సంచిక 3



ఈ సంచికలో...



ఈ నెల విశేషాలు



దైవసాన్నిధ్యం!
(బేతాళ కథలు)

యక్ష పర్వతం



నచ్చిన కోడలు





భారత సంస్కృతి
చరిత్ర

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, No.82, Defence Officers Colony, Ekattuthangal, Chennai - 600 097. Editor: Viswam

సంపాదకుడు

విశ్వం



ఉత్తర ప్రత్యుత్తరాలకు:
చందమామ మేగజైన్ డివిజన్
నం.82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈక్కాట్టుతాంగల్,
చెన్నయ్ - 600 097.
టెలిఫోన్/ఫ్యాక్స్ : 234 7384, 234 7399
ఇ.మెయిల్ :
chandamama@vsnl.com



అమెరికాలో
విడికాపీ $2
సంవత్సర చందా $20
సొమ్ము పంపవలసిన
చిరునామా:
ఇండియా అబ్రాడ్
43 వెస్ట్ 24 స్ట్రీట్
న్యూయార్క్
ఎన్ వై 10010
ఫోన్: (212)929-1727
ఫ్యాక్స్: 212-627-9503



సంచాలకులు

చక్రపాణి. బి.నాగిరెడ్డి

# చదవడానికి సమయం ఏదీ?

మానసిక వికాసానికీ, బుద్ధి కుశలతకూ దోహదం చేసేది విద్య. విద్యాభివృద్ధికి తొలిమెట్టు పిల్లలలో చదివే అలవాటు. పెరుగుతూన్న ఎలక్ట్రానిక్ మీడియా కారణంగా పిల్లలలో చదివే అలవాటు తగ్గిపోతున్నదేమో అన్న అనుమానం కలుగుతున్నది.

"టీవీలు వచ్చేశాయి. పొద్దస్తమానం వాటి ముందే కూర్చుండి పోతున్నారు. ఇక వాళ్ళకు చదవడానికి సమయం ఏదీ?" అని వాపోతూ తల్లిదండ్రులు మూడు దశాబ్దాల నాడే టీవీలను నిందించడం మొదలుపెట్టారు. అయినా టీవీల ప్రాబల్యం తగ్గడంలేదు. పైగా పెద్దలే టీవీల ముందు తిష్టవేస్తున్నారు. వినోదానికి ప్రత్యామ్నాయ మార్గం చూప కుండా పిల్లల్ని విమర్శించడంద్వారా పెద్దగా ఒరిగేదేమీ ఉండదు.

డెబ్భైలలో ఈ విషయం మీద అప్పటి సోవియట్ యూనియన్‌లో ఒక సర్వే జరి పారు. పిల్లలలో జ్ఞానాసక్తిని రేకెత్తించి, పుస్తకాల నుంచి వివిధ విషయాలు చదివి తెలుసు కోవడానికి టీవీ కార్యక్రమాలు ఉపకరిస్తాయని ఆ సర్వే ఫలితాలు తెలియజేశాయి. తల్లిదండ్రులకూ, రచయితలకూ, ప్రచురణకర్తలకూ కొంత ఊరట కలిగించే విషయం ఇది!

ప్రస్తుతం కంప్యూటర్‌లు, ఇంటర్‌నెట్‌లాంటి ఎలక్ట్రానిక్ పరికరాలు పిల్లల దృష్టిని పుస్తక పఠనం నుంచి దారిమళ్ళిస్తున్నాయని కొందరు పెద్దలు భావిస్తున్నారు. పైగా, ఇంటర్‌నెట్ ద్వారా అవసరం లేని సమాచారం కూడా పిల్లలకు అందుతుందేమో అన్న అనుమానం ఒకవైపు; గంటల తరబడి కంప్యూటర్‌ల ముందు కూర్చోవడం వల్ల పిల్లల కళ్ళూ, ఆరోగ్యం దెబ్బ తింటాయన్న భయం మరోవైపు పెద్దలకు కలుగుతున్నాయి. అయినప్పటికీ, దూసుకు వస్తూన్న సమాచార సాంకేతిక పరిజ్ఞానాన్ని ఎలా, ఎంతవరకు ఉపయోగించుకోవాలనే విషయంలో పిల్లలకు దారి చూపడం పెద్దలు తమ బాధ్యతగా గుర్తించాలి.

ఏది ఏమైనా ఇటీవల చెన్నయ్, విజయవాడ నగరాలలో జరిగిన పుస్తక ప్రదర్శనలకు పిల్లలు అసంఖ్యాకంగా వచ్చారు. పిల్లలలో పుస్తకాల పట్ల, చదవడం పట్ల ఆసక్తి తగ్గలేదనడానికి ఇదొక ముదావహమైన నిదర్శనం!

# చందమామ కబుర్లు




## 1,000– ఏళ్ళ వివాదం!

నిజానికి ఈ వివాదం వెయ్యేళ్ళ నాటిది కాదు; వెయ్యేళ్ళూ సాగలేదు. ఒక్క సంవత్సరం మాత్రమే సాగింది. ఇంతకూ ఈ వివాదం దేన్ని గురించి అనుకున్నారు? నవసహస్రాబ్ది ఆగమనం గురించే. మూడవ సహస్రాబ్ది 2000 జనవరితో ఆరంభమయిందా? లేక ఒక సంవత్సరం తరవాత అంటే 2001 జనవరిలో అడుగుపెట్టిందా అన్నదే ఆ వివాదం. చివరికి సుప్రసిద్ధ సైన్స్ ఫిక్షన్ రచయిత ఆర్థర్ సి.క్లార్క్ 'అసలు ఆరంభం' 01.01.01 అని నిర్ద్వంద్వంగా తేల్చి చెప్పడంతో ఈ వివాదానికి తెరపడింది. 2000 జనవరిని నవసహస్రాబ్ది ఆరంభం అని చెప్పినవాళ్ళు కాస్త తొందర పడ్డారని ఆయన అభిప్రాయపడ్డాడు. 1999 చివరిరోజున నవసహస్రాబ్ది 'వేడుకలు' ఆరంభమయిన నాటినుంచి దీనికొక వివరణ కావాలని పలువురు కోరినప్పటికీ ఆయన మౌనం వహించాడు. కనీసం వచ్చే సహస్రాబ్దికైనా ఈ వివాదం తలెత్తకూడదని ఆశిద్దాం!

## ఇది మీ రికార్డు కోసమే!



మొరోకోలోని 13ఏళ్ళ కుర్రవాడికి ఒకటే తుమ్ములు. ఆరు రోజుల్లో 1,100 సార్లు తుమ్మాడు.ఒక్కరోజులోనే 200 సార్లు తుమ్మాడు. తుమ్మడంలో రికార్డు సృష్టించడం అతని ఉద్దేశం కాదు. అతడు ఆపాలనుకున్నా ఆగకుండా వచ్చాయి. అరుదుగా వచ్చే ఒక విచిత్రమైన దేహస్థితి ఇది అని అతనికి ఛికిత్స చేసిన డాక్టర్లు చెప్పారు. అతని తుమ్ములు ఆపడానికి రకరకాలుగా ప్రయత్నించి, చివరికి మందుల ద్వారా అతన్ని నిద్రపుచ్చి తుమ్ములు ఆపారు. హా...ఛ్...! ఏమిటీ? మీకూ తుమ్ములు వస్తున్నాయా!

## ఒక సహస్రాబ్ది నుంచి మరో సహస్రాబ్దికి!

మలేసియా రాజధాని కోలాలంపూర్‌లోవున్న ప్రపంచంలోనే ఎత్తయిన (390 మీ॥) పెట్రొనాస్ ట్విన్ టవర్స్ నుంచి — అమెరికా, జర్మనీ, స్వీడన్, సౌదీ అరేబియా దేశాలకు చెందిన పదకొండుమంది 'డైవర్స్' 2000 వ సం॥ ఆఖరి నిమిషాల్లో కిందికి దూకారు. వాళ్ళు నేలను తాకేసరికి 2001 వచ్చేసింది!



## ఈతలో కొత్త విన్యాసం!

ఇది కేరళ సముద్రతీర జలాలలో జరిగింది. శ్యాం ప్రబోధిని అనే ఇరవై ఒక్క సంవత్సరాల యువకుడు కాళ్ళూ, చేతులూ తాళ్ళతో బంధించుకున్నాడు. ఒక్క గెంతుతో నీళ్ళలోకి దూకి అలాగే 19 నిమిషాల్లో 3 కి.మీ. ఈదాడు. అతడు గట్టు మీదికి చేరాక చూస్తే కాళ్ళకు చేతులకు కట్టుకున్న తాళ్ళు అలాగే ఉన్నాయి. ఈ అద్భుత విన్యాసాన్ని చూడడానికి వచ్చిన వేలాది జనం చప్పట్లతో శ్యాంకు ఘనస్వాగతం పలికి ప్రశంసలు కురిపించారు!

## లెక్కల మాష్టార్లంటే....

ఆర్థర్ క్లార్క్,లెక్కల ద్వారానే సహస్రాబ్ది సమస్యకు పరిష్కారం కనుగొన్నాడు. బహుశా మీరందరూ కూడా ఆయన దగ్గర లెక్కలు నేర్చుకోవాలని ఆశపడుతూ ఉండవచ్చు. ఇంగ్లాండులోని ఒక విశ్వవిద్యాలయం వారికి ఒక విచిత్ర విషయం మీద పరిశోధనలు జరపాలనిపించింది. మామూలుగా లెక్కల మాష్టార్లంటే పిల్లలకు ఇష్టం వుండదు కదా. కాబట్టి వాళ్ళ చేత వాళ్ళ లెక్కల మాష్టార్ల బొమ్మలు గీయమంటే ఎలా గీస్తారో చూద్దాం, అనుకున్నారు. అందుకోసం 12-13 ఏళ్ళ మధ్య వయస్కులను బ్రిటన్, స్వీడన్, నార్వే, ఫిన్‌లండ్, జర్మనీ, రొమానియా, అమెరికా దేశాలనుంచి 300 మంది బాల బాలికలను ఎంపిక చేసి; 'మీకు మీ లెక్కల ఉపాధ్యాయులు ఎలా కనిపిస్తారోఅలాగే బొమ్మలు గీయండి' అని చెప్పారు. ఏవో కొన్ని చిత్రాలు తప్ప మిగిలినవన్నీ లెక్కల మేష్టార్లను మెచ్చుకునేలా లేవు. బట్టతలలతో, వికారమైన గెడ్డాలతో, కళ్ళద్దాలతో, నుదుటి గీతలతో, ముఖాలపై గాయం మచ్చలతో, ఇంకా కొందరు పెద్ద దంతాలతో, తలలపై కొమ్ములతో చిత్రించారు! "లెక్కల మేష్టార్లకు, ఇతర లెక్కల మేష్టార్లు తప్ప స్నేహితులే ఉండరు," "వాళ్ళకు ముక్కుమీద కోపం!" "తుపాకీ గురిపెట్టి పిల్లల చేత లెక్కలు చేయిస్తారు!" "సరదాగా గడపడం అంటే వాళ్ళకు తెలియదు!" అంటూ రకరకాల వ్యాఖ్యానాలు వేరే రాశారు. లెక్కల ఉపాధ్యాయుల గురించి పిల్లల మనసులలో సానుకూల అభిప్రాయం ఏర్పరచడానికి ఇప్పుడు పరిశోధకులు ప్రయత్నిస్తున్నారు.



# గుజరాత్ భూకంపం

జనవరి 26 దేశ ప్రజలందరూ రిపబ్లిక్ దినోత్సవ వేడుకల కోసం ఎదురుచూసే రోజు. ఈ యేడాది కూడా ఎప్పటిలాగే ప్రతి రాష్ట్రం, నగరం, పట్టణం, గ్రామం ఆ రోజు కోసం సిద్ధమయ్యాయి. రిపబ్లిక్ దినోత్సవాలలో పాల్గొని వేలాది మంది తమ దేశభక్తినీ, ఆనందోత్సాహాలనూ చాటారు. టీవీలలో రిపబ్లిక్ దినోత్సవాలను చూస్తున్న సమయంలో-గుజరాత్ ప్రాంతం చరిత్రలో కనీ వినీ ఎరుగని భీకర భూకంపానికి లోనయింది!

రిపబ్లిక్‌డే వేడుకలు పూర్తికావడానికి కొన్ని గంటల ముందు వాటిల్లిన ఈ భూప్రళయం-గుజరాత్‌లోని కొన్ని నగరాలను, పట్టణాలను, గ్రామాలను నేలమట్టం చేసింది. క్షణాలలో ఇళ్ళన్నీ పేకమేడల్లా కుప్పకూలిపోయాయి. వేలాది మంది భవనాల శిథిలాలలో చిక్కుకుపోయారు; క్షతగాత్రులయ్యారు. వేలాదిమంది ఆచూకీ తెలియడంలేదు. అసంఖ్యాకులు నిలవడానికి నీడలేని నిరాశ్రయులయ్యారు; అనాథలుగా మిగిలిపోయారు. మృతుల సంఖ్య అంచనాలకు అంతుబట్టడంలేదు. ఎటు తిరిగినా మాటలకు అందని వేదన,రోదన; విషాదం, శోకం! ఆస్తి నష్టం అపారం!

'రాన్ ఆఫ్ కచ్' కేంద్ర బిందువుగా సంభవించిన ఈ భూకంపం దక్షిణ, తూర్పు ప్రాంతాలను అతలాకుతలం చేసింది. భుజ్, అంజార్, బచావ్ సమీప ప్రాంతాలు ఘోరంగా దెబ్బతిన్నాయి. ద్వారక ఆలయం స్వల్పంగా దెబ్బతిన్నదనీ, భుజ్ చారిత్రక ప్రదర్శనశాల శిథిలమయిందనీ వార్తలు వెలువడుతున్నాయి. పలు చారిత్రక భవనాలు నామరూపాలు లేకుండా పోయాయి!

సహాయ రక్షణ చర్యలు, పునరావాస ప్రయత్నాలు యుద్ధ ప్రాతిపదికలో సాగుతున్నాయి. దేశ విదేశాలనుంచి ఔషధాలు, ఆహారం, బట్టలు, నీరు మొదలైన నిత్యావసర వస్తువుల రూపంలోనూ, ధనరూపంలోనూ సహాయం అందుతోంది. ఎక్కడెక్కడి నుంచో వైద్యబృందాలు వస్తున్నాయి; స్వచ్ఛంద సేవకులు వస్తున్నారు. మానవత్వానికి ఎల్లలు లేవని నిరూపిస్తున్నారు.

తుఫానులు, వరదలు, ఉప్పెనలు మొదలైన ప్రకృతి వైపరీత్యాలు ముంచుకు రావడానికి కొంత ముందే గుర్తించి, గ్రహించవచ్చు. తగు జాగ్రత్తలు తీసుకోవచ్చు. అయితే రానున్న భూకంపాలను ముందే గుర్తించి తెలుసుకోగల స్థాయికి మన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం ఇంకా అభివృద్ధి చెందలేదు. అందువల్ల భూకంపాల విలయ తాండవం నుంచి తప్పించుకోలేకపోతున్నాం. భారీ నష్టాలు కలుగుతున్నాయి.

భూకంప బాధితులైన మన గుజరాత్ సోదరులకు చేతనైన సాయం చేద్దాం. ప్రధాన మంత్రి జాతీయ సహాయనిధికి (ప్రధానమంత్రి కార్యాలయం, న్యూఢిల్లీ - 110 011) ఉదారంగా విరాళాలు పంపి ఈ జాతీయ విపత్తును అధిగమించడానికి చేయూత నిద్దాం!

— ప్రచురణకర్త




# దైవసాన్నిధ్యం!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, భీతిగొలిపే ఈ శ్మశానంలో నువ్వు ఏ కార్యాన్ని సాధించగోరి శ్రమల కోర్చుతున్నావో, నాకు తెలియదు. కాని, కేవలం శ్రమలకోర్చగల ఓర్పూ, పట్టుదలా వున్నంత మాత్రాన, ఆశించిన కార్యంసిద్ధిస్తుందనేందుకుఆధారాలేం లేవు. సూచనప్రాయంగానైనా కార్య సిద్ధి కలిగితీరుతుందనేందుకు, నీకే దైనా నిదర్శనం లాంటిది లభ్యమైందా? అలా లేనప్పుడు, నువ్వు పడుతున్న



శ్రమంతా వృథా అయితీరుతుంది. నీకు తగు హెచ్చరికగా వుండేందుకు, రామాచారి అనే పూజారి కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

చక్రపురాన్ని పాలించే చంద్రసేన మహారాజుకు జబ్బుచేసి మంచం పట్టాడు.వైద్యులు తమ జ్ఞానాన్నంతా ఉపయోగించి మందులు వాడినా ప్రయోజనం కనబడలేదు.అలాంటి సమయంలో రాజుకు ఒక కల వచ్చింది. ఆ కలలో ఒక దివ్యపురుషుడు కనిపించి, ''నీ పరిపాలనలో ప్రజల మధ్య స్వార్థం పెచ్చుమీరింది. పాపచింతన ఎక్కువైంది. కులం, మతం, జాతి పేరుతో ప్రతి పౌరుడూ, సాటి పౌరుణ్ణి వేరుచేసి ద్వేషిస్తున్నాడు. ప్రజల తప్పులకు రాజుదే బాధ్యత. అందువల్లనే, నీకీ తీరని మాయదారి జబ్బు చేసింది,'' అని చెప్పాడు.

చంద్రసేనుడు, ఆ దివ్యపురుషుడికి నమస్కరించి, ''నా తప్పు నేను సవరించుకుంటాను. కానీ అందుకు ముందుగా, నా జబ్బు నయం కావాలిగదా! అందుకు తమరేదైనాఉపాయం సెలవివ్వండి,'' అని కోరాడు.

అందుకు,ఆ దివ్యపురుషుడు, ''మూడంటే మూడు తులసి ఆకులు నమిలితే, నీ జబ్బు మటుమాయమవుతుంది.అయితే,ఆ తులసి ఆకులు నీ నోట్లో వేసినవాడు, పది సంవత్సరాల పాటు ఒక్క క్షణం కూడా దైవసాన్నిధ్యాన్ని వీడకుండా చిత్తశుద్ధితో దైవానికి పూజలు చేస్తున్నవాడైవుండాలి!'' అని చెప్పి మాయమయ్యాడు.

మెలకువ రాగానే చంద్రసేనుడు,మంత్రులను పిలిచి తనకు వచ్చిన కల గురించి చెప్పాడు. అందరికీ కూడా ఆ కలలో నిజమున్నదనిపించింది. అందువల్ల, వెంటనే వాళ్ళు మహారాజుకు రోగనివారణ చేయగల మనిషి కోసం అన్వేషణ ప్రారంభించారు.

సీతాపురం అనే గ్రామంలో ప్రసిద్ధి కెక్కిన రామాలయముంది. ఆ ఆలయ పూజారి రామాచారి గొప్ప విష్ణుభక్తుడు; సదాచార సంపన్నుడు. పన్నెండేళ్ళ క్రితం ఆయన ఒక పండితుడితో వాదన చేయవలసివచ్చింది. ఆ పండితుడు ఎక్కడో దూరప్రాంతాలకు వెళ్ళి, మన పురాణాలతో ఏమాత్రం సంబంధంలేని, జ్వాలామాలి అనే దేవుడి భక్తిలో పడ్డాడు. ఈ జ్వాలామాలి, శివకేశవులకంటే గొప్పవాడని పండితుడు ప్రచారం చేస్తూంటే భరించలేని రామాచారి, ఆయనతో కొద్దిసేపు వాదనలయ్యాక ఏమీ ప్రయోజనం కనిపించకపోవడంతో, ''నీతో మాటలెందుకు? నీ

వంటివాడిని తాకితేనే,నాకు పాపం!''అంటూ, అక్కణ్ణించి కదలబోయాడు.

''జ్వాలామాలిని నమ్మినవాడికి ఏపాపాలూ అంటవు. అందువల్ల,నిన్ను తాకాలంటే నాకు భయంలేదు.ఇప్పుడు నేను, నిన్ను తాకి కొంత పాపాన్ని అంటిస్తాను. జ్వాలామాలిని నమ్మే దాకా,ఆ పాపం నిన్ను వదలదు!''అంటూ, ఆ పండితుడు,రామాచారిని బలవంతంగా చేయిపట్టుకుని ఆపాడు.

రామాచారి చేయి విదిలించుకుని,తిన్నగా రామాలయానికివెళ్ళి, ''శ్రీరామచంద్రప్రభో! ఒక పాపి నన్ను తాకాడు. నేనా పాపం నుంచి విముక్తుడినయ్యానని,నీవు నిదర్శనం చూపే వరకూ, ఇక్కడే వుండిపోతాను,'' అన్నాడు.

ఆ రోజునుంచీ రామాచారి నివాసం అన్ని వేళలా, రామాలయంలోనే. భార్యాబిడ్డలు వచ్చి ఎంత బ్రతిమాలినా ఆయన ఇంటికి వెళ్ళలేదు. అలా పన్నెండేళ్ళు గడిచి పోయాయి. ప్రజల్లో ఆయనకు మహా భక్తుడుగా పేరు వచ్చింది. చాలామంది శ్రీరాముడినేకాక, ఆయననూ దర్శించు కోవాలని రామాలయానికి వెళ్ళేవారు.

చంద్రసేన మహారాజు మంత్రులకు, రామాచారి గురించి త్వరలోనే తెలిసింది. వారాయనను రాజధానికి రావలసిందిగా వార్త పంపారు. కానీ తను ప్రతిజ్ఞాబద్ధుడననీ, రామాలయం విడిచి రావడం కుదరదనీ, ఆయన వచ్చిన దూతలకు బదులిచ్చాడు.

అప్పుడు మంత్రులలో ఒకరు రామా చారిని స్వయంగా కలుసుకుని, మహారాజు వద్దకు వస్తే లక్ష వరహాలిస్తానన్నాడు. రాక పోతే కఠిన కారాగారశిక్ష వేస్తానన్నాడు. దేనికీ



రామాచారి చలించలేదు.అన్నింటికీ రాముడే వున్నాడని, ఆయన నమ్మకం!

మంత్రి, రామాచారి భక్తికి మెచ్చుకుని, ''అయ్యా! తమరు నిదర్శనం కోసం ఎదురు చూస్తున్నారుగదా! మహారాజు ఆరోగ్యం కుదుటపడితే,జ్వాలామాలి భక్తుణ్ణి తాకిన పాపం పరిహారమయినట్టు తమకు రుజువ వుతుంది. కాబట్టి, తమరు రాజధానికి వచ్చి, మహారాజు నోట్లో తులసి ఆకులు వేసి, ఆయనను రోగ బాధనుంచి విముక్తుణ్ణి చేయండి,'' అని కోరాడు.

దీనికి రామాచారి తల అడ్డంగా ఊపి, ''చంద్రసేన మహారాజు తండ్రి ఉగ్రసేనుల వారు, ఏటా ఈ రామాలయానికి వచ్చి దైవ దర్శనం చేసుకునేవారు. చంద్రసేనులవారు ఒక్కసారి కూడా ఇక్కడికిరాలేదు. అందుకే, శ్రీరామచంద్రప్రభువు,ఆయనను ఈవిధంగా




ఇక్కడికి రప్పించుకుంటున్నాడు. నిదర్శనం కోసం నేను ఆలయాన్ని విడిచిపెట్టను. నిదర్శనం కనిపించాకే, ఆలయంనుంచి బయటికి వస్తాను. మహారాజునే ఇక్కడికి తీసుకురండి!'' అంటూ మొండి పట్టు పట్టాడు.

చేసేదిలేక మంత్రి రాజధానికి తిరిగి వెళ్ళి, జరిగినదంతా రాజుకు విన్నవించాడు.అంతా విని చంద్రసేనుడు పరమానందభరితుడై, ''ఆ రామాచారి గొప్ప భక్తుడు! అలాంటి వాణ్ణి దర్శించుకోవడం వల్లనే, నాకు సమస్త పాపాలూ పటాపంచలవుతాయి. నా కల నిజమయ్యే రోజు దగ్గరపడుతున్నది. నన్ను సీతాపురంలోని రామాలయానికి చేర్చే ఏర్పాట్లు చేయండి!'' అన్నాడు.

వెంటనే రాజును సీతాపురం చేర్చడానికి ఏర్పాట్లు జరిగాయి. ఒక ముత్యాల పల్లకీలో, ఆయనను పరుండబెట్టారు.బోయీలు పల్లకి నెత్తి, కుదుపు తెలియని విధంగా అతి జాగ్రత్తగా నడవసాగారు. రాజుకు ముందు సైనికులున్నారు. వెనక పరివారమున్నది. ఆ వెనక మళ్ళీ సైనికులున్నారు.

వాళ్ళు సీతాపురం పొలిమేరలకు చేరుకునే సమయానికి పెద్ద గాలి వీచింది. శరవేగంతో వీస్తున్న ఆ గాలికి భయపడి,బోయీలు ఒక చెట్టుకింద పల్లకిని దింపారు. సైన్యం, పరివారం ఆ చెట్టు చుట్టూ చేరారు.

ఆ సమయంలో అక్కడికి ఒక యోగి వచ్చాడు.ఆయన, రాజువద్దకు వెళుతూంటే, ఏ పరివారమూ ఆపలేదు. యోగి, రాజును సమీపించి, ''నాయనా! నీ ప్రయాణం ఎక్కడికి?'' అని అడిగాడు.

రాజు లేవడానికి ప్రయత్నిస్తుంటే, యోగి వారించాడు. రాజు పడుకునివుండే, తన కథను ఆయనకు చెప్పుకున్నాడు.

యోగి వెంటనే, ''నా వద్ద ఎటువంటి జబ్బునైనా నయం చేయగల తులసిఆకులు వున్నాయి. అవి మూడు తింటే, నీ జబ్బు నయమవుతుంది, ఇచ్చేదా?'' అన్నాడు.

''స్వామీ! నాది విచిత్రమైన జబ్బు.తమరు పది సంవత్సరాలపాటు, ఒక్క క్షణం కూడా విడవకుండా,ఏఆలయంలోనైనా గడిపారా?'' అని అడిగాడు చంద్రసేనుడు.

యోగి నవ్వి, ''నేను నిత్య సంచారిని!'' అన్నాడు.

మరుక్షణం చంద్రసేనుడు, తను రామాచారిచేతి తులసి ఆకులే తింటానని చెప్పాడు.

''నాయనా! నీవు జ్ఞానివి. నీలోని జ్ఞానమే అంతర్మథనమై స్వప్నరూపంలో నీకు దర్శన

మిచ్చింది. అయినా, కొంత అజ్ఞానం నిన్ను విడిచిపెట్టలేదు.అందుకే, రామాచారివద్దకు వెళతానంటున్నావు. అక్కడ నీకు ఏ సత్ఫలితమూ కనిపించదు. నీవు ఇక్కడి నుంచే వెనుతిరిగిపోవచ్చు. నేనిస్తానన్న తులసి ఆకులు సేవించు!'' అన్నాడు యోగి.

ఈ సంభాషణ అంతా వింటున్న ఒక మంత్రి ముందుకు వచ్చి, చంద్రసేనుడితో, ''ప్రభూ! ఈ యోగి తను నిత్యసంచారి నంటున్నాడు. అంటే-ఏ ఆలయంలోనూ పట్టుమని పది క్షణాలైనా వుండడన్నమాట. పైగా, రామాచారి వద్దకు వెళ్ళడం అజ్ఞానమంటున్నాడు. చూస్తూంటే, ఇతడు శ్రీ రాముడు పంపగా మిమ్మల్ని పరీక్షించడానికి వచ్చిన దూతైనా అయుండాలి. లేదా తమకు ఆరోగ్యం చేకూరడం ఇష్టంలేని శత్రుగూఢచారి అయినా కావచ్చు. ఇంత దూరం వచ్చి, ఇప్పుడు ఇతడి మాటపై నమ్మకం పెట్టుకోవడం మంచిదికాదు,'' అన్నాడు.

చంద్రసేనుడు కాసేపాలోచించి యోగితో, ''స్వామీ! మీ మాటలతో నాకు జ్ఞానోదయమైంది. కానీ కొందరికి నిదర్శనాలతో జ్ఞానోదయమవుతుంది. నేను రామాచారి దగ్గరకు వెళ్ళి వస్తాను. అంతవరకూ, మీరిక్కడ వేచివుండగలరా?'' అన్నాడు.

యోగి అక్కడ వుండేందుకు సమ్మతించాడు.

కొంతసేపటికి గాలి ఉధృతం తగ్గింది. చంద్రసేనుడు రామాలయానికివెళ్ళి,రామాచారి ఇచ్చిన తులసి ఆకులు తిన్నాడు. ఏ ఫలితమూ కనబడలేదు. ఖిన్నుడైన రామా



చారితో ఆయన, ''నాతో పాటు యోగి దగ్గరకు రా!'' అన్నాడు.

చంద్రసేనుడు, రామాచారి, పరివారం తిరిగి యోగివున్న ప్రదేశానికి వచ్చారు.యోగి ఇచ్చిన మూడు తులసిఆకులూ తినగానే, రాజు శరీరంలో కొత్త జవసత్వాలు వచ్చాయి. ఆయన చప్పున పల్లకీలోంచి దిగి, ఉత్సాహంగా అటూ ఇటూ వేగంగా నడిచాడు. తర్వాత, ఆయన వెంటవున్న పరివారం, సైనికులతో రాజధానికి బయలుదేరాడు. రామాచారి పుట్టెడు విచారంతో తలవంచుకుని రామాలయంకేసికాక, తన ఇంటికేసి నడిచాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, నిండు పన్నెండేళ్ళకాలం ఇంటినీ, భార్యాబిడ్డలనూ వదిలి, దైవసాన్నిధ్యంలో గడిపిన వాడుగదా రామాచారి!అటువంటి మహా

భక్తుడిచ్చిన తులసిఆకులు, చంద్రసేనుడి జబ్బును నయం చేయలేకపోవడం, విచిత్రంగా లేదా? పైగా, పన్నెండేళ్ళ సుదీర్ఘ కాలం, ప్రతిజ్ఞాభంగం కలగకుండా రామాలయంలో గడిపిన అతడు, ఆలయానికి కాక ఇంటికి తిరిగివెళ్ళడమంటే, అతడిలో దైవ భక్తి నశించి, నాస్తికుడయ్యాడనుకోవాలా? అది అలావుంచితే– ఏ దైవసాన్నిధ్యంలోనూ, పట్టుమని పది క్షణాలైనా వుండని, నిత్య సంచారి యోగి! అయినా, అటువంటి వాడిచ్చిన తులసిఆకులు రాజు జబ్బును నయం చేయడం,వింతగాకనబడుతున్నది.ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''దేవుడూ, దైవ సాన్నిధ్యాన్నీ గురించిన నమ్మకం విషయంలో రామాచారికీ, యోగికీ చాలా తేడా వున్నది. తను నమ్మిన దేవుడూ, ఆలయం తప్ప, ఇతరత్రా అన్నీ అసత్యాలనే దురహంకారి రామాచారి. ఆ కారణంవల్లనే అతడు,ఎక్కడోదూర ప్రాంతాల నుంచి వచ్చిన, జ్వాలామాలి అనే దేవుడి భక్తుడైన పండితుణ్ణి, పాపి అని దూషించడమే గాక, తాకితేనే తనకు పాపం అంటుకుంటుందన్నాడు. కాని, ఎప్పుడైతే, తానిచ్చిన మూడు తులసిఆకులు, రాజు జబ్బును నయం చేయలేకపోయాయో, ఆ మరుక్షణమే అతడు మనసులో ఎలాంటి మలినం, దురహంకారం లేకపోవడమే, దైవ సాన్నిధ్యానికి దగ్గరదారి; అంతేగాని ఆలయంలో ఎల్లవేళలా కాలం గడపడంకాదన్న సత్యాన్ని గ్రహించి ఇంటికి బయలుదేరాడు. యోగి అలాకాక, నిత్యసంచారిగా, ఈ ప్రపంచాన్నే ఒక దేవాలయంగా భావించి, ప్రతి ప్రాణిలోనూ దైవత్వాన్ని చూడగల పుణ్య పురుషుడు. అందుచేతనే, అతడిచ్చిన తులసి ఆకులు రాజు జబ్బును కుదర్చగలిగాయి. దేవుణ్ణి గురించిన భావనలో రామాచారి–యోగి మధ్యవున్న వైరుధ్యాన్ని అర్థం చేసుకుంటే, రాజు జబ్బు కుదరడంలో విచిత్రం గాని, వింతగాని ఏమీలేదు,''అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం: ''వసుంధర'' రచన]





# యక్షపర్వతం

## 3

[ఖడ్గజాతి వాళ్ళు చెప్పిన దారి వెంట పోయి, ఖడ్గజీవదత్తులుబందిపోట్లను ఒక నదీతీరం దగ్గర కలుసుకున్నారు. రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత, ఖడ్గజీవదత్తులు వాళ్ళపైకి దాడిపోబోయేంతలో, దాపులనున్న ఒక కొండగుహలో నుంచి మాంత్రికుడొకడు పంపగా, శరీరమంతా జడలు కప్పిన వికృతాకారుడొకడు, కొండలూ, అరణ్యం మార్మోగేలా కేకపెట్టి,బందిపోట్లకేసి పరిగెత్తుకు రాసాగాడు. తరవాత-]

ఎర్రగా కాలుతూ చిటపటమంటున్న నెగడు ముందు కూర్చుని, తన అనుచరులతో కబుర్లాడుతున్న బందిపోట్ల నాయకుడు, గుహ వైపునుంచి వచ్చిన వికృతమైన అరుపులూ, కేకలూ వింటూనే చప్పున తల తిప్పి అటుకేసి చూశాడు. అతడికి నిలువెత్తునవున్న నల్లని ఆకారం ఒకటి తమకేసి పరుగెత్తుకు రావటం కనిపించింది. ఆ ఆకారం చేతిలో భగభగమండుతున్న కాగడా ఒకటి వున్నది.

"ఏమిటీ, ఈ భీతి కొల్పే రూపం? ఏదైనా రాక్షసా లేక కొండపిశాచమా?" అంటూ బందిపోట్ల నాయకుడు లేచి నిలబడ్డాడు.

"దొరా,ఇదేదో మనుషుల్ని పీక్కుతినే రాక్షసే! సందేహం వలదు!" అంటూ బందిపోట్ల నాయకుడి అనుచరులు నలుగురూ నదీతీరం కేసి పరిగెత్తసాగారు.

"పిరికి వెధవల్లారా, ఆగండి! ఈ కొండ పిశాచాన్ని ఈటెలతో పొడిచి చంపుదాం," అంటూ బందిపోట్లనాయకుడు కేకపెట్టాడు.

అతడి అనుచరులు ఆ హెచ్చరిక వినిపించుకోకుండా చెట్లకేసి కొందరూ, నది వైపుకు కొందరూ పారిపోసాగారు. ఈ లోగా వికృతాకారం, ఇంకా నిద్రపోతున్న కొందరు బందిపోట్లమీద హఠాత్తుగా వచ్చిపడి,వాళ్ళను తన్నుతూ,చేతిలోనికాగడాతో వాళ్ళ దుస్తులకు నిప్పు పెట్టి నానాబీభత్సమూ చేయసాగింది.



నాయకుడు కాస్త ధైర్యసాహసాలున్న వాడిలా కనిపిస్తున్నాడు. వాడు కొందరు అనుచరులను కూడగట్టుకుని, వికృతాకారుడిని వెనక వైపునుంచి దెబ్బ తీసేందుకు పొంచి పొంచి మరీ నడుస్తున్నాడు,'' అన్నాడు.

''జీవా! మనం స్వర్ణాచారి ఈ గొడవలో ఏ ఒంటెల కాళ్ళ కిందో పడి చావకుండా చూడాలి,'' అన్నాడు ఖడ్గవర్మ.

ఖడ్గవర్మ మాటలు ముగించే లోపలే, మాంత్రికుడున్న కొండగుహమధ్య పెద్దమంట లేచింది.మాంత్రికుడు ఆ మంటలో,నూనెలో తడిపి వుంచిన కాగడాలను ఒక్కొక్కదాన్నే ముట్టించి,''శాంభవీ!భైరవీ!''అని అరుస్తూ, దిగువనున్న బందిపోట్ల మీదికి విసరసాగాడు.

ఈ కొత్త దాడిని చూస్తూనే బందిపోట్ల నాయకుడు అదిరిపడి, తన అనుచరులతో, ''ఒరే, ఉష్ట్రవీరుల్లారా! ఈ కనబడే వికృత పిశాచం లాంటివి, ఆ పైనున్న కొండ గుహలో మరికొన్ని వున్నట్టుంది.అందరూ నది దిగువకు బయలుదేరండి.జొన్నకంకులున్న గోతాలను నదిలోకి తోయండి. నది వాలు వెంట తేలి వచ్చే వాటిని, దిగువ ఎక్కడైనా పట్టుకుని ఒడ్డుకు చేరుద్దాం,'' అని కేక పెట్టాడు.

ఇంతలో, గుహలోవున్న మాంత్రికుడు ఒక చేతితో కాగడా పట్టుకుని అటూ ఇటూ వూపుతూ, ''ఒరే, జడలభూతం! ఇంక, ఆ బందిపోటు నరాధముల్ని వెంటతగిలి, జొన్నకంకుల గోతాముల్ని నదిలోవేసే వాళ్ళను పట్టుకుని,నదీభూతానికి ఆహారంగావెయ్యి,'' అని పెద్దగా అరిచాడు.

మాంత్రికుడి హెచ్చరిక వింటూనే,జొన్న కంకుల గోతాలను భుజాలకెత్తుకుని నది

చెట్టుమీదవున్న ఖడ్గజీవదత్తులు, ఈ భయంకర దృశ్యాన్ని చూసి, ఒక క్షణకాలం నిశ్చేష్టులైపోయారు. చెట్టు కిందవున్న ఖడ్గ జాతివాళ్ళు నలుగురూ భయంతో వణికి పోతున్నారు.

''ఖడ్గా! ఈ వికృతాకారం రాక్షసీకాదు, పిశాచమ్మూకాదు. ఆగుహలోవున్న మాంత్రికుడు ఏవో మంత్రాలు వల్లించి, వాటిద్వారా శివమెక్కించి పంపిన, ఎవడో మనిషి అయి వుంటాడు,'' అన్నాడు జీవదత్తుడు.

''ఏమైతేనేం, మనం చేయాలనుకున్న పని, ఆ మాంత్రికుడు చేస్తున్నాడు. బందిపోట్లు పారిపోయింతర్వాత, జొన్నకంకుల గోతాంలోవున్న స్వర్ణాచారిని విడిపించుకుని, మనదారిన మనం పోదాం,''అన్నాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు, నదీతీరంలో వికృతాకారుడు చేస్తున్న కల్లోలంకేసి చూసి,''బందిపోట్ల

కేసి పరిగెత్తుతున్న బందిపోట్లలో అందిన వాడి నల్లా నడుం పట్టుకుని, జడలభూతం నదిలోకి విసిరివేయ సాగింది.

ఆ సమయంలో ఒక మానవకంఠం, ''రక్షించండి! రక్షించండి! నన్ను నదిలో పడ వెయ్యకండి,'' అంటూ గగ్గోలు ప్రారంభించింది. అంతలోనే దభీమంటూ, గోతాం ఒకటి నదిలో పడిన శబ్దమైంది.

''ఖడ్గా ! ఆ కంఠస్వరాన్నిపోల్చుకున్నావా? ఆ కేకలు పెట్టిన వాడు స్వర్ణాచారి! జొన్న కంకుల గోతాం నీట మునగదు కనక, స్వర్ణాచారి నీటివాలున కొట్టుకుపోయి, ఎక్కడో ఒక చోట నది ఒడ్డుకు చేరే అవకాశంవుంది. ఖడ్గజాతి వాళ్ళల్లో ఒకణ్ణి, నదీతీరం వెంట దిగువకు పొమ్మని చెబుతాను,'' అన్నాడు జీవదత్తుడు, చెట్టుమీద నుంచి దిగుతూ.

'' నువ్వు ఖడ్గజాతివాడికి చెప్పవలసిందేదో చెప్పిరా. నేనిక్కడే వుంటాను,'' అని ఖడ్గ వర్మ విల్లంబులు చేతికి తీసుకున్నాడు.

ఈ లోపల, జడలభూతం ధాటికి తారెత్తి పోయిన బందిపోటు నాయకుడు, తన అనుచరులతో,'' అందరూ నది ఒడ్డు వెంట దిగువకు పరిగెత్తిరండి. మనం జొన్నకంకుల మూటలను నది ఒడ్డుకు చేర్చాలి,'' అంటూ పరిగెత్తసాగాడు.

''ఆహాఁ , తెలివితక్కువ కొద్దీ ఆలస్యం చేశాను.దుర్మార్గుడుప్రాణాలతో తప్పించుకు పోతున్నాడు,'' అంటూ ఖడ్గవర్మ, బంది పోటుకేసి బాణం వదిలాడు. కాని, ఆ సరికే వాడు, బతికివున్న తన అనుచరులతో పాటు ఖడ్గవర్మ బాణం వేటుకు అందనంత దూరం పరిగెత్తిపోయాడు.



ఇప్పుడా ప్రదేశమంతా పెద్ద జడివాన హఠాత్తుగా ఆగిపోయినట్టు, ఒక్క క్షణకాలం నిశ్శబ్దమైపోయింది. అయితే, అంతలోనే మాంత్రికుడు గుహ ముందుకు వచ్చి, కాగడాను పైకెత్తి పట్టుకుని, తల అటూ ఇటూ తిప్పి చూస్తూ, ''ఒరే, జడలభూతం! నువ్వెక్కడ? జొన్నకంకుల మూటలు కొన్నయినా మన చేత బడినయ్యా?'' అని కేక వేశాడు.

జడలభూతం గుహకేసి బయలుదేరేంతలో, దాని దృష్టి ఖడ్గ జాతి వాళ్ళమీద పడింది. వెంటనే అది భీతిగొన్నట్టు కీచుమనే కంఠ స్వరంతో, ''యమకింకరులు! ఒంటికొమ్ము మహిషాలెక్కి శూలాలతో వచ్చారు!'' అని కేక పెట్టింది.

ఆ కేకవింటూనే మాంత్రికుడు గుహ లోంచి మరికాస్త ముందుకు వచ్చి,కాగడాల వెలుగులో ఖడ్గమృగాలనూ, వాటిని ఎక్కి



వున్న వాళ్ళనూ చూసి, ''ఒరే, జడలభూతం! వాళ్ళు యమకింకరులూకారు; అవి ఒంటి కొమ్ము మహిషాలూకావు. ఖడ్గజాతి వాళ్ళూ, ఖడ్గమృగాలూ! తెలిసిందా? వెళ్ళి మీద పడి,ముందు మనుషుల్ని విరుచుకుతిను, తర్వాత మృగాలను తిందువుగాని,''అన్నాడు.

ఖడ్గజాతివాళ్ళకు రానున్న ప్రమాదాన్ని గుర్తించిన ఖడ్గజీవదత్తులు,వాళ్ళున్నచోటుకు బయలుదేరారు. ఖడ్గవర్మ ఒక బాణాన్ని గురి చూసి జడలభూతానికేసి వదిలాడు. అది పోయి భూతాన్ని తాకిందిగాని, దాని శరీరం మీద ఒత్తుగావున్న జడలవల్ల భూతం ఏమాత్రం గాయపడలేదు.

''గురో! ఎవడో నామీద కొయ్యములికి కొట్టాడు!''అంటూ కేకపెట్టింది భూతం.

మాంత్రికుడు నిర్ఘాంతపోతూ,ముందుకు పరిగెత్తుకొస్తున్న ఖడ్గజీవదత్తులను చూసి, కళ్ళెర్ర చేసి, ''ఒరే, జడలభూతం! నీ శరీరాన్ని తాకింది కొయ్యములికి కాదు, బాణం! అది కొట్టినవాడు క్షత్రియుడిలావున్నాడు. వెంట వున్న రెండవవాడు సగం క్షత్రియుడూ, సగం మంత్రవేత్తలావున్నాడు. నా మంత్ర దండాన్ని విసిరి ఇద్దర్నీ ఇప్పుడే చితాభస్మంగా మార్చి, ఉఫ్ అని గాల్లోకి ఊదేస్తాను,'' అంటూ ఎగిరి గంతేసి గుహలోకి వెళ్ళాడు.

ఖడ్గవర్మ గుహకేసి అనుమానంగా ఓసారి చూసి, జీవదత్తుడితో,'' జీవా! నీ వేషం ఆ మాంత్రికుణ్ణి కొంచెం హడలగొట్టినట్టున్నది. నీకూ మంత్రతంత్రాలు తెలుసునని అతడు గ్రహించే, హడావిడిగా గుహలోపలికి పరిగెత్తాడు. ఇప్పుడేం చేయడం?'' అన్నాడు.

''ముందు, ఈ మాంత్రికుడూ, జడలభూతం సంగతేమిటో తేల్చుదాం. సరేనా?'' అన్నాడు జీవదత్తుడు

''అలా అయితే ఇక ఆలస్యమెందుకు? గుహలో జొరబడదాం,'' అంటూ ముందు కడుగువేశాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు, ఖడ్గవర్మతో పాటు గహకేసి నడుస్తూ,చుట్టూ ఓమారు కలయచూశాడు.

ఒక చోట జడలభూతాన్ని, ఖడ్గజాతి వాళ్ళు ముగ్గురూ చుట్టుముట్టి ఈటెలతో పొడిచే ప్రయత్నం చేస్తున్నారు. కాని, భూతం దెబ్బలు తప్పుకుంటూ,''గురో! గురో!'' అని అరుస్తూ గుహకేసి పరిగెత్తుతున్నది.

ఖడ్గజాతి వాళ్ళల్లో ఒకడు తానెక్కివున్న ఖడ్గమృగాన్ని దిగి, జీవదత్తుడి దగ్గరకు వచ్చి, ''దొరా, పెద్ద పొరబాటు జరిగిపోయింది. మన దగ్గర పొడవాటి తాడు ఏద్దైనా వుండి వుంటే భూతాన్ని తేలిగ్గా పట్టుకునే

పని. మా ఈటె పోట్లు దానినేమీ గాయ పరిచినట్టులేదు, శరీరాన్ని నిండుగా కప్పి వున్న జడలు దాన్ని కాపాడినై,'' అన్నాడు.

''ఈసారి ఆ భూతాన్ని నువ్వన్నట్టు తాడు విసిరి పట్టుకుని బంధిద్దాం. మీరిక్కడే వుండండి.మేముగుహలోకి పోయిభూతాన్నీ, దాని యజమాని అయిన మాంత్రికుణ్ణీ అందితే పట్టుకుని, దిగువకు గిరవాటు వేస్తాం,'' అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గజీవదత్తులు బండరాళ్ళమీదుగా ఎక్కి పోయి గుహద్వారాన్ని సమీపించే సమయానికి కొంచెం ముందుగానే జడలభూతం అక్కడికి చేరి, ''గురో! ఆ ఒంటికొమ్ము మహిషాలెక్క వచ్చిన యమకింకరులకు మరిద్దరు మనుషులు తోడయ్యారు.అందరూ గుహలోకి వస్తున్నారు. తొందరగా వాళ్ళను భస్మం చేసి గాల్లోకి ఊదెయ్యి!'' అంటూ పెద్దగా కేకపెడుతూ గుహలోకి పోయింది.

కొద్దిసేపటి తర్వాత ఖడ్గజీవదత్తులు గుహలో ప్రవేశించారు. కాని, అక్కడ మాంత్రికుడు గాని, జడలభూతం గాని వాళ్ళకు కనిపించలేదు. ''జీవా! ఈ దుర్మార్గులిద్దరికీ మాయమై పోయే శక్తులేమైనా వున్నవంటావా?'' అన్నాడు ఖడ్గవర్మ ఆశ్చర్యంగా.

''ఊహూ, అంత గొప్పశక్తులు సాధించిన వాళ్ళయితే, బందిపోట్లు దొంగిలించుకు వచ్చిన జొన్నపంటను, తాము తిరిగి దొంగిలించుకు పోయేందుకు అంతగా హైరాన పడిపోరు,''అంటూ,గుహగోడల్లోని రాళ్ళలో, ఒక నలుచదరపురాయి కొద్దిగా కదిలి వున్నట్టు కనిపించడంతో,దాన్ని బలంగా వెనక్కు నెట్టాడు.



ఆ వెంటనే రాయి శబ్దం చేస్తూ కదిలి వెనక్కు పడిపోయింది. ఖడ్గజీవదత్తులు, అక్కడ ఏర్పడిన కంతలోంచి బయటికి చూశారు. అక్కడ మనుషులున్న జాడలేదు.

''జీవా! ఆ దుర్మార్గులు మననుంచి చాలా ఒడుపుగా తప్పించుకుపోవడమేగాక,మనల్ని మూర్ఖుల్ని చేశారు. వాళ్ళు పారిపోయేందుకు అవతల మరేదో గుహామార్గం వుండవచ్చు!'' అన్నాడు ఖడ్గవర్మ.

''ఇప్పుడేం చేసేట్టు! అవతల తెల్లవారబోతున్నది,''అంటూ జీవదత్తుడు గుహలో వెలుగుతున్న ఒక కాగడా తీసుకుని, దాన్ని కంతనుంచి బయటికి విసిరాడు. దాని వెలుగులో వాళ్ళకు, ఒక చిన్న సొరంగ మార్గం కనిపించింది.

ఖడ్గజీవదత్తులిద్దరూ కంతలోంచి జారి, సొరంగ మార్గంలోకి దిగారు. అక్కడ వాళ్ళకు



రాళ్ళూ రప్పలూ తప్ప మరేం కనబడలేదు. ఖడ్గవర్మ కత్తి దూసి, కింద పడివున్న కాగడాను చేతికి తీసుకుని సొరంగమార్గం వెంట బయలుదేరాడు. జీవదత్తుడు సొరంగం గోడలకు రహస్యద్వారం ఎక్కడైనా వున్న దేమోతెలుసుకునేందుకు మంత్రదండంతో పొడిచి చూస్తూ,ఖడ్గవర్మను అనుసరించాడు.

అలా వాళ్ళిద్దరూ కాగడా వెలుగులో సొరంగ మార్గాన రెండు మూడు నిమిషాలు నడిచి, దాని ముఖప్రదేశాన్ని చేరారు. ఎదురుగా వాళ్ళకు విశాలమైన బయలు ప్రదేశం, అక్కడ శిథిలావస్థలోవున్న చిన్నా పెద్ద భవ నాలూ, వాటి పైన మరింత శిథిలావస్థలో వున్న ఎత్తయిన బురుజూ కనిపించాయి.

జీవదత్తుడు ఆ శిథిల భవనాలను చూస్తూనే ఆశ్చర్యంతో, ''ఖడ్గా! సూర్యోదయకాలం సమీపించింది. మనం గుహలో నుంచి సొరం గంలో పడి, అక్కడి నుంచి ఎలాంటి శిథిల నగరాన్ని చేరామో చూశావా?'' అన్నాడు.

''ఇది శిథిల నగరమా? ఏముందిక్కడ, కొద్దిపాటి శిథిలమైన భవనాలు తప్ప!'' అన్నాడు ఖడ్గవర్మ.

''ఏమో, ఒకప్పుడివే నగరంలోని ప్రధాన భాగమై వుండొచ్చు. మన మాంత్రికుడూ, వాడి జడలభూతం ఈ శిథిలాల్లోని ఏదో కలుగులో ఎలుకల్లా దాగివుంటారు. వాళ్ళను బయటికి లాగడం ఎట్లా?'' అన్నాడు జీవ దత్తుడు.

జీవదత్తుడు అనుకున్నట్టు మాంత్రి కుడూ, జడలభూతం అక్కడి శిథిల భవనా ల్లోని, ఏ నేలమాళిగలోనో దాక్కుని లేరు. వాళ్ళు ఆ భవనాలలోని ఒక పెద్ద మంట పంలో ఉన్నతాసనం మీద కూర్చునివున్న, ఒక పూజారిణి ముందు మోకరిల్లి వున్నారు. వాళ్ళ పక్కన కొందరు భయంకరాకారులు కత్తులు పట్టుకుని నిలబడి వున్నారు.

పూజారిణి కళ్ళెర్ర చేసి పళ్ళు పటపట కొరికి, ''ఒరే, మాంత్రిక భూతాధముల్లారా, ఇక లేచి నిలబడండి! మీ బుద్ధి లేమివల్ల, ఈ పవిత్ర మహానగర రహస్యం కాస్తా, నర మానవులకు తెలిసిపోయింది,'' అన్నది.

''మహాశక్తీ! ఆ మానవులిద్దర్నీ మీ ఆజ్ఞ అయితే, ఇప్పుడే పట్టి తెచ్చి మహాభూతానికి బలి చేస్తాను,'' అన్నాడు మాంత్రికుడు గడ గడ వణికిపోతూ.

పూజారిణి వికటంగా నవ్వి, ''ఆహారాన్ని నోటి దగ్గరకు తెచ్చి పెడితే తప్ప తినలేనంత మందమతి అయిపోయింది, నీ జడల

భూతం. మహాభూతం దయవల్ల ఆ మానవులిద్దరూ, మన ప్రయత్నం లేకుండానే, ఈ ప్రదేశానికి వచ్చి చేరారు. వాళ్ళెవరో, ఎక్కడి నుంచి వచ్చారో, ఆ వివరాలన్నీ తెలుసుకోకుండా, తొందరపడి మహాభూతానికి వాళ్ళను బలిచేయడం చాలాప్రమాదం, తెలిసిందా?'' అన్నది చేతిలోవున్న శూలాన్ని ఝుళిపిస్తూ.

''ఆ, తెలిసింది మహాశక్తీ, తెలిసింది!'' అన్నారు అక్కడవున్న భృత్యులందరూ ఏకకంఠంగా.

పూజారిణి అందరికేసి ఓసారి పరీక్షగా చూసి, ''ఇప్పుడు చెప్పేది జాగ్రత్తగా వినండి, శుంఠల్లారా! ఆ మానవులిద్దరికీ ఎలాంటి హానీకలిగించకుండా పట్టుకుని, నా దగ్గరకు తీసుకురావాలి. సూర్యోదయం అయింది. వాళ్ళు మన పవిత్ర శిథిల భవనాల్లో ఎక్కడ ఏమున్నదో చూసేందుకు బయలుదేరి వుంటారు. మీలో కొందరు రహస్యంగా వాళ్ళను అనుసరించి,వాళ్ళు ఏం మాట్లాడుకుంటారో వినండి! సూర్యుడు నడినెత్తి మీదికి వచ్చినప్పటి శుభ ముహూర్త సమయంలో, వాళ్ళను పట్టి నాదగ్గరకు తీసుకురావాలి. ఈ లోపల వాళ్ళను స్వేచ్ఛగా తిరగనివ్వండి,'' అని ఆజ్ఞాపించింది.

''చిత్తం, మహాశక్తీ, చిత్తం!'' అంటూ నలుగురు పూజారిణి భృత్యులూ, మాంత్రికుడూ, అతడి జడలభూతం పూజారిణికి నడుం వరకూ వంగి నమస్కరించి, మంటపం నుంచి బయటికి వచ్చారు.

జడలభూతం కోపంతో చిందులు తొక్కుతూ, '' గురో! వెనకనుంచి పోయి మీద పడి, ఆ మానవులిద్దర్నీ విరుచుకుతింటాను. వాళ్ళ కారణంగా నేను మహాశక్తి పూజారిణి చేత, నానా తిట్లూ తిన్నాను,'' అన్నది.

''నేనంత కన్న ఎక్కువ అవమానం పాలయ్యాను!''అంటూ మాంత్రికుడు ఒక పొట్టి కత్తిని బలంగా గుప్పెట బిగించిపట్టుకుని, ''అదుగో, వాళ్ళు సొరంగద్వారం ముందు కూర్చుని వున్నారు. మనం వాళ్ళిద్దర్నీ అక్కడే హతం చేసి అరణ్యంలోకి పారిపోదాం. ఎంత మహాశక్తి వంతమైన మంత్రాలు నేర్చినదైనా, ఈ పూజారిణి తిట్టేతిట్లకు తలవంచడం ఇక కుదరదు!'' అంటూ చిరుతపులిలా వంగి పొంచి నడుస్తూ, ఖడ్గజీవదత్తుల కేసి బయలు దేరాడు. —(ఇంకావుంది)



ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు -
తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!

# 14. అధికారబలం - తపోబలం!



దేవనాథుడు మనవడూ, మనవరాలితో కలిసి సాయంకాలం ఏటిగట్టున కొంతసేపు నడిచి, పార్కులోని ఒక బెంచీ మీద కూర్చున్నాడు.

"వసిష్ఠుడు చాలా గొప్పవాడు, తాతయ్యా! అయితే, విశ్వామిత్రుడి ప్రవర్తనను మాత్రం అర్థం చేసుకోలేకపోతున్నాను. ఒక ముని మరొకమునిని హతమార్చడానికి ఎలా పూనుకోగలడు? అసలు మునికి ఆ ఆలోచన రావచ్చా?" అని అడిగాడు సందీపుడు.

"అన్నయ్యా! నువ్వు నాన్న ఎదటా, ఉపాధ్యాయుల దగ్గరా, ఇంటికి బంధుమిత్రులు వచ్చినప్పుడూ బుద్ధిగా మహాసాధువులా నడుచుకుంటూ, వాళ్ళటువెళ్ళగానే నన్ను ఆటపట్టించడం లేదూ? అదీ అలాంటిదే!" అన్నది శ్యామల వెంటతెచ్చిన ఫ్లాస్కు నుంచి తాతకు టీ అందిస్తూ.

దేవనాథుడు నవ్వుతూ, "నువ్వన్నది నిజమే కాని, ఏ విషయాన్నయినా కనీసం రెండు కోణాలనుంచి చూడవచ్చు. సందీపుడు చిలిపివాడు; కాని, కొన్ని సందర్భాలలో సాధువులా నడుచుకుంటాడు, అని నువ్వన్నావు. దీనిని మరొక విధంగా, అంటే - సందీపుడు సాధువు; కొన్ని సందర్భాలలో మాత్రం చిలిపిగా నడుచుకుంటాడు అని కూడా చెప్పవచ్చుకదా?" అన్నాడు.

"విన్నావా? వివేకం అంటే అదీ!" అంటూ సందీపుడు చిన్నగా నవ్వుతూ చెల్లెలి చెవిని మెల్లగా మెలిపెట్టాడు.

"అవునవును! నీకు అనుకూలంగాఉన్నంత వరకు ఆ సంగతి వివేకంఅని గుర్తిస్తావు. మొదట చెయ్యి తియ్యి," అంటూ శ్యామల అన్నయ్య చేతిని అవతలికి తోసింది.

"సగం మృగం— సగం దైవం కలిసినదే మానవ నైజం. సాధువూ, క్రూరుడూ ఒకే వ్యక్తిలో ఉండవచ్చు. విశ్వామిత్రుడి విషయంలో ఇది నూటికి నూరుపాళ్ళు నిజం. మామూలు స్థితి నుంచి, ఆయన మహాముని స్థాయికి ఎదిగాడు. ఆయన దయారహితంగా, క్రూరంగా కనిపించడం పైకి మాత్రమే. పైగా, ఒక వ్యక్తి స్వభావాన్ని నిర్ణయించే ముందు ఆ వ్యక్తి పుట్టు పూర్వోత్తరాలు, పరిస్థితుల ప్రభావాలు మొద



లైనవాటిని కూడా క్షుణ్ణంగా పరిశీలించాలి,'' అన్నాడు దేవనాథుడు.

''అతి గారాబం చూపడం వల్లే అన్నయ్య చిలిపిగా తయారయ్యాడు. అది మనకు తెలుసు. అలాగే విశ్వామిత్రుడు ఆగ్రహావేశాలతో ప్రవర్తించడానికి కూడా ఏవైనా బలమైన కారణాలు ఉన్నాయా తాతయ్యా?'' అని అడిగింది శ్యామల నవ్వుతూ.

''విశ్వామిత్రుడి ఆగ్రహావేశాలకు న్యాయం కల్పించడం కాదుగాని, ఆయన ఎందుకలా ప్రవర్తించాడు అని వివరించే విషయాలు చాలా ఉన్నాయి,'' అంటూ దేవనాథుడు ఇలా చెప్పసాగాడు:

విశ్వామిత్రుడు సత్యాన్వేషి కాదు; శాస్త్రాలు చదువుకున్న పండితుడూ కాడు. మామూలు మనిషీ అంటే అదీ కాదు. ఆదర్శ ప్రభువుగా కన్యాకుబ్జాన్ని పరిపాలించినవాడు. కాకుంటే ఆనాటి రాజులకు వుండే అహంకారం ఆయనలో మరింత ఎక్కువగా ఉండేది.

ఆయన ఒకనాడు వేటకు వెళ్ళి, అడవిలో చాలాసేపు వేటాడాడు. మధ్యాహ్నం విశ్రాంతి తీసుకోవడానికి నదీతీరంలోవున్న వసిష్ఠముని ఆశ్రమానికి వెళ్ళాడు. ముని రాజు పరివారానికి సాదరంతో స్వాగతం పలికి, అతిథి మర్యాదలు జరిపి, షడ్రసోపేతంగా విందు ఏర్పాటుచేశాడు. అంత త్వరగా అన్ని రకాల వంటలు ముని ఎలా సమకూర్చగలిగాడా అని విశ్వామిత్రుడు ఆశ్చర్యపోయాడు. ఆశ్రమవాసులు కొందరు నదీతీరంలో పచ్చిక మేస్తున్న ఒక అందమైన ఆవును చూపించి, ''అదిగో, నందిని అనే హోమధేనువు. ముని కోరే కోర్కెలను తీర్చే దివ్యధేనువు అదే!'' అని చెప్పారు.

సిరిసంపదల మీదా, రాజ్య విస్తరణ పట్లా ఏమాత్రం ఆసక్తిలేని, ఎటువంటి కోరికలూ లేని మునిఆశ్రమంలో కోరిన కోరికలు తీర్చే హోమధేనువు నందిని! ఆ గోవు గనక తనవద్ద ఉన్నట్టయితే, ప్రజలకు కష్టాలు రానివ్వను కదా! అవలీలగా రాజ్యాన్ని విస్తరించవచ్చుకదా? అని ఆలోచించిన విశ్వామిత్రుడు హోమధేనువును తన సొంతం చేసుకోవాలనుకున్నాడు.

హోమధేనువును తన వశం చేయమని వసిష్ఠుణ్ణి కోరాడు. అయితే వసిష్ఠుడు అలా చేయలేని తన అశక్తతను తెలియజేశాడు. ఆశ్రమంలో ఉండడమో; రాజప్రాసాదానికి వెళ్ళడమో హోమధేనువే నిర్ణయిస్తుందనీ, దాని ఇష్టాయిష్టాలను తాను శాసించలేననీ చెప్పాడు.

విశ్వామిత్రుడు ఆగ్రహోదగ్రుడయ్యాడు. రాజునైన తన కోరికను ఒక ముని తిరస్కరించడమా? తన ఆనతిని ధిక్కరించడమా? గోవును బలవంతంగా రాజధానికి తరలించమని భటులకు ఆజ్ఞాపించాడు. కాని భటులెవ్వరూ దానిని సమీపించలేకపోయారు. ఏదో అదృశ్యశక్తి వాళ్ళను తరిమి కొట్టింది.



విశ్వామిత్రుడు రాజధానికి వెళ్ళిపెద్ద సైన్యాన్ని వెంటబెట్టుకుని వచ్చాడు. అయినా హోమధేనువు నుంచి వెలువడిన సైనికులు ఆయన సేనలను క్షణాలలో నిర్మూలించారు.

విశ్వామిత్రుడు ఒక్కక్షణం దిగ్భ్రాంతి చెందాడు.ఆవేశంతో,అవమానంతో విలవిలలాడి కుంగిపోయాడు.

మానవశక్తితో కాకుండా, అద్భుతమైన తపోబలంతో వసిష్ఠుడు తన సేనలను నిర్మూలించగలిగాడని విశ్వామిత్రుడు గ్రహించాడు. రాజ్యసింహాసనాన్ని త్యజించి తపస్సు ప్రారంభించాడు. అచిర కాలంలోనే అద్భుతశక్తులను సాధించాడుగాని, ఆయనలోని రాజుననే అహంకారం మాత్రం ఓపట్టాన తగ్గలేదు. అయితే వీడని పట్టుదలతో, పరిపక్వతతో ఆఖరికి ఆయన అహంకారాన్ని కూడా అధిగమించాడు.

అనుకున్నది ఎలాగైనా సాధించాలనే పట్టుదల ఆయన్ను ఒక అపూర్వ సాహసకృత్యం నిర్వర్తించేలాగా చేసింది.ఆయన కాలంలోనే సత్యవ్రతుడనే యువరాజు ఉండేవాడు. మూడు పాపాలకు ఒడిగట్టినవాడు గనక,అతన్ని త్రిశంకు అని కూడా పిలిచేవారు. ప్రజాకంటకుడు గనక, అతనికి అతని తండ్రి అరణ్యవాస శిక్ష విధించాడు. అతడు అడవిలో ఉన్నప్పుడు గొప్ప క్షామం ఏర్పడింది.విశ్వామిత్రుడు తపోనిమగ్నుడై పోవడంతో కుటీరంలో వున్న ఆయన భార్యాపిల్లలను కాపాడేవారు లేకపోయారు.ఆ సమయంలో త్రిశంకువు వాళ్ళపై దయతలచి ఆహారం తెచ్చి ఇచ్చికాపాడాడు. తపస్సు పూర్తి చేసుకుని వచ్చిన విశ్వామిత్రుడు త్రిశంకు చేసిన సహాయానికి సంతోషించాడు.

ఆ తరవాత త్రిశంకు తండ్రి,కొడుకుపై విధించిన శిక్షను రద్దు చేసి, అతన్ని రాజ్యానికి రప్పించి, పట్టాభిషిక్తుణ్ణి చేసి వానప్రస్థానికి అడవికి చేరాడు.త్రిశంకు ఆదర్శ పాలకుడుగా ప్రజల మన్ననలు పొందాడు.

కొంత కాలానికి త్రిశంకువుకు శరీరంతోనే స్వర్గానికి వెళ్ళాలన్న వింత కోరిక కలిగింది. వసిష్ఠుడి దగ్గరికి వెళ్ళి తన కోరికను వెలిబుచ్చి, దానికి కావలసిన యజ్ఞం చేసి తనను స్వర్గానికి పంపమన్నాడు. అయితే, వసిష్ఠుడు దేహంతో స్వర్గానికి చేరే మార్గం లేదనీ;అందువల్లదానినిసూచించేయజ్ఞయాగాలూ, మంత్ర తంత్రాలూ ఏ శాస్త్రం లోనూ లేవనీ చెప్పాడు. త్రిశంకు అంతటితో వదలక ఇతర మునులను ఆశ్రయించాడు. ఎవరూ సాయపడలేక పోయారు. ఆఖరికి అతడు విశ్వామిత్రుణ్ణి దర్శించి, తన కోరిక తెలియజేశాడు. రాజర్షి విశ్వామిత్రుడు– తన అద్భుత తపోశక్తిని ప్రదర్శించి, అందరి కన్న తాను అధికుడనని నిరూపించడానికి ఇదొక అవకాశంగా భావించాడు. త్రిశంకు కోరికను తీర్చడం తన తపోశక్తికి ఒక పరీక్షగా, పందెంగా తీసుకున్నాడు.

ఆయన యజ్ఞం ప్రారంభించి, తన తపోశక్తిని ధారపోసి త్రిశంకువును పైకి ఎగసి స్వర్గద్వారాలను సమీపించేలా చేశాడు. కాని అక్కడి ఇంద్రాది

దేవతలు అతన్ని కిందికి తోశారు. త్రిశంకు విశ్వా మిత్రుణ్ణి తలుచుకుంటూ కిందికి పడిపోసాగాడు. దానిని గమనించిన విశ్వామిత్రుడు, ''ఆగు!'' అని శాసించాడు.అతడు అక్కడే ఆగిపోయాడు. విశ్వా మిత్రుడు తన తపోశక్తితో త్రిశంకువుకు నూతన స్వర్గం సృష్టించాడు!

''త్రిశంకు స్వర్గంఇంకావుందా తాతయ్యా?''అని అడిగారు అంతవరకు కథను ఆసక్తిగా వింటూన్న సందీపుడు, శ్యామల ఒక్కసారిగా.

''లేదు. శరీరంతోనా, కాదా అన్నది తెలియదు గాని అతడెప్పుడో అసలు స్వర్గాన్ని చేరుకున్నాడు. ఈ ఇతివృత్తాలన్నింటినీ కేవలం కథలుగా తీసుకో కూడదు. వీటిలోని అంతరార్థాలను గమనించాలి. అధికార బలం కన్నా, తపోబలం మిన్న; భౌతిక శక్తులకన్నా, ఆధ్యాత్మికశక్తులు గొప్పవి అన్న విషయం ఈ కథ మనకు సూచిస్తుంది. సాధార ణంగా సన్యాసులు, యోగులు భౌతిక కాయాన్ని ఆధ్యాత్మిక ప్రగతికి అవరోధంగా భావిస్తారు.అయితే, ఆధ్యాత్మిక సాధనకు ఆత్మలాగే శరీరంకూడా ముఖ్య మైనదనిభావించిన సాహస వంతులైన ఆశావాదులూ లేక పోలేదు. శరీరానికి కూడా స్వర్గ ప్రాప్తి కలిగించవచ్చు అన్నది వాళ్ళ విశ్వాసం. అలాంటి ఆశా వాదులు ఈరోజు ఆశించే ఆశలు, కనే కలలు— రేపు వాస్తవాలు కావచ్చు,''అన్నాడు దేవనాథుడు.



''రేపేనా?''అన్నాడు సందీ పుడు ఆశ్చర్యంతో నవ్వుతూ.

''రేపుఅంటే రాబోయే నవశకంలో.మనిషి నిర్మల మైన చైతన్యంకారణంగా శరీరతత్వమే మారిపోయే కాలంలో- ఆ అవకాశం ఉందన్న అద్భుత సత్యాన్ని ఇరవైయవ శతాబ్దంలో శ్రీ అరవిందులు మన ముందు ఉంచారు. ఈనాటి మన సాధారణ జీవితం మును ముందు దివ్యజీవనంగా పరిణమిస్తుంది. అప్పుడు జరామరణాల శాసనాలకు లోబడిన మన స్థూలశరీరం సైతం నూతన శుభలక్షణాలను సంత రించుకుంటుంది. అదే మహా ద్భుత చైతన్యనివాసానికి తగిన సుందర మందిరంగా రూపొంద గలదు అని అరవిందులు విశ్వ శించారు,''అన్నాడు దేవనాథుడు.




''అంటే, మనం మొదట మహాద్భుత చైతన్యాన్ని పెంపొం దించుకోవాలి. అంతేకదా తాతయ్యా?'' అన్నది శ్యామల.

''అవును తల్లీ, చక్కగా చెప్పావు!''అంటూ దేవనాథుడు మనమరాలిని ఆప్యాయంగా కౌగి లించుకున్నాడు—(ఇంకావుంది)

# ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

బంధువులు అందించిన ఆర్థిక సాయంతో జర్మనీలో ఉన్నత విద్యను పూర్తిచేసుకుని డాక్టరేట్ పట్టాతో ఒక యువకుడు మద్రాసు విమానాశ్రయంలో దిగాడు. స్వదేశానికయితే వచ్చాడు కాని, అక్కడి నుంచి స్వస్థలానికి చేరుకోవడానికి ఆయన దగ్గర డబ్బులు లేవు. ఉన్నట్టుండి ఆయనకో ఆలోచన వచ్చింది. తిన్నగా 'ది హిందు' పత్రిక కార్యాలయానికి వెళ్ళాడు. "ఒక వ్యాసం రాసి ఇస్తాను? వెంటనే పారితోషికం ఇవ్వగలరా?" అని అడిగాడు. సంపాదకుడు సరే అన్నాడు. వెంటనే ఆయన, ఒక రాజకీయ వ్యాసం రాసి ఇచ్చాడు. దానికి లభించిన పారితోషికంతో టిక్కెట్టు కొనుక్కుని తన ఊరు చేరాడు. ఇది 1933లో జరిగింది.

ఉత్సాహశీలి అయిన ఆ యువకుడు మరెవరో కాదు. సోషలిస్టు మేధావిగా, మానవతావాదిగా, రాజకీయ నాయకుడుగా పేరుగాంచిన రాంమనోహర్ లోహియా.

అప్పటి యునైటెడ్ ప్రావిన్సెస్‌లోని అక్బర్‌పూర్ గ్రామంలో 1910 మార్చ్ 23వ తేదీ రాం మనోహర్ లోహియా జన్మించాడు. ఆయన పదేళ్ళ ప్రాయంలోనే రాజకీయ జీవితం ఆరంభమయింది. విదేశ వస్తు బహిష్కరణ, సహాయ నిరాకరణోద్యమం, మొదలైన జాతీయ ఉద్యమాలలో పాల్గొన్నాడు. గాంధీజీ చేపట్టిన సత్యాగ్రహ ఉద్యమంలోకూడా పాల్గొన్నాడు కానీ, ఆయనదేన్నీ గుడ్డిగా అనుసరించేవాడు కాడు.

కాశీ హిందూవిశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉన్నప్పుడే ఆయన మంచివక్తగా అందరి దృష్టినీ ఆకర్షించాడు. 1929లో అఖిల భారత విద్యార్థి కాంగ్రెస్ నాయకుడయ్యాడు.

1934లో ఆయన కాంగ్రెస్ పార్టీలో చేరాడు. కాంగ్రెస్ యువనాయకులు కొందరు విడిగా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని ఏర్పాటు చేసినప్పుడు లోహియాను 'కాంగ్రెస్ సోషలిస్ట్' పత్రిక సంపాదకుడిగా నియమించారు.

1942 క్విట్ ఇండియా ఉద్యమ సమయంలో–ప్రజలకు స్ఫూర్తినిచ్చే కరపత్రాలను, పోస్టర్లను రహస్యంగా ముద్రించి పంచి పెట్టాడు. బొంబాయి నుంచి 'కాంగ్రెస్‌రేడియో' అనే రహస్య కేంద్రం ద్వారా ఉద్యమంలో చేరమని ప్రజలకు పిలుపునిచ్చాడు. బ్రిటిష్ ప్రభుత్వం ఆయన్ను చెరసాలలో పెట్టి వేధించింది. అయినా ఆయన వెనుకాడలేదు.



రాం మనోహర్ లోహియా

అంతర్జాతీయ రాజకీయ రంగంలోకూడా లోహియా కృషి చేశాడు. 1952లో ప్రథమ ఆసియా సోషలిస్టు సమావేశం ఏర్పాటుకు ఆయన కృషి చేశాడు.

1953వ సం॥లో ఆయన కొందరు నాయకులతో కలిసి ప్రజాసోషలిస్టు పార్టీని స్థాపించాడు. భారతీయ భాషల అభివృద్ధి, కుల, వర్గ, రహిత సమాజ స్థాపన మొదలైన పార్టీ లక్ష్యాలకోసం ఆయన కృషి చేశాడు.

1963 ఉప ఎన్నికలలో ఆయన ఉత్తర ప్రదేశ్‌లోని ఫరూకాబాద్ నుంచి పార్లమెంటుకు ఎన్నికయ్యాడు. పార్లమెంటులో ఆయన గొప్ప వక్తగా, ఉత్తమ పార్లమెంటేరియన్‌గా పేరుగాంచాడు.

సామాన్య ప్రజలు కాలువలు తవ్వడం, ఆనకట్టలు కట్టడం మొదలైన నిర్మాణాత్మక పనుల్లో పాల్గొనేలా చేయడానికి ఆయన పాటుపడ్డాడు. 1967 అక్టోబర్ 12వ తేదీ ఆయన కీర్తిశేషుడయ్యాడు.

1940వ సం॥లో 'హరిజన్' పత్రికలో రాసిన ప్రభుత్వ వ్యతిరేక వ్యాసం కారణంగా లోహియాను బ్రిటిష్ ప్రభుత్వం పట్టుకుని జైల్లో పెట్టింది. ఆ సందర్భంగా గాంధీజీ ఇలా అన్నాడు: "లోహియాకన్నా ధైర్యశాలినీ, నిరాడంబర వ్యక్తినీ నేను చూడలేదు. ఆయన ఎప్పుడు గాని హింసను ప్రచారం చేయలేదు. ఆయన చేసిన పనులు ఆయన గౌరవ మర్యాదలను ఇనుమడింపచేసేవిగా ఉన్నాయి."

ఇదొక చందమామ కానుక!

# 20-వ శతాబ్దంలో భారత దేశం

## 3. ప్రగతి పథంలో స్వతంత్ర భారతం!
## ఇరుగుపొరుగుతో యుద్ధం-శాంతి 1951 - 1976

స్వతంత్ర భారతదేశ తొలి మంత్రిమండలి-ప్రపంచ యుద్ధం, దేశ విభజన పర్యవసానంగా ఏర్పడిన ఆర్థిక సంక్షోభం నుంచి బయటపడడానికి అధిక ప్రాధాన్యత నిచ్చింది. ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షుడుగానూ, ప్రొఫెసర్ పి.సి.మహలానోబిస్ ఉపాధ్యక్షుడుగానూ ప్రణాళికా సంఘం ఏర్పాటయింది. 1951 జూలైలో ప్రణాళికా సంఘం ప్రథమ పంచవర్ష ప్రణాళికను రూపొందించింది. జాతీయాదాయం పెంపొందించడం; జీవన ప్రమాణాన్ని మెరుగుపరచడం; ఆహారధాన్యాలు, ముడిసరకుల ఉత్పత్తి పెంచడం; ఉద్యోగావకాశాలు కల్పించడం లక్ష్యాలుగా ప్రథమ పంచవర్ష ప్రణాళిక రూపొందించబడింది. వ్యవసాయాభివృద్ధికి ప్రథమస్థానం ఇవ్వబడింది.



కాశ్మీరులో యుద్ధ విరమణ చేయాలని ఇండియా-పాకిస్తాన్‌లు నిర్ణయించినప్పటికీ అక్కడ అలజడి మాత్రం అంతం కాలేదు. ప్రత్యేక రాజ్యాంగం కావాలని నేషనల్ కాన్ఫరెన్స్ పార్టీ కోరింది. ఐక్య రాజ్య సమితి ఆధ్వర్యంలో కాశ్మీరు భారతదేశంతో కలిసి వుండాలని ఇంగ్లాండు, అమెరికా దేశాలు సూచించాయి. ఇది ఐక్య రాజ్య సమితి చార్టర్‌కు విరుద్ధమైన ప్రతిపాదన అని ఇండియా భావించింది. ఆక్రమిత ప్రాంతం నుంచి మొదట పాకిస్తాన్ తన సేనలను ఉపసంహరించుకోవాలని ఇండియా కోరింది. కాశ్మీరు మహారాజా ఎన్నికలు ప్రకటించాడు. 75 స్థానాలతో శాసనసభ ఏర్పాటుకు ఇండియా అంగీకరించింది. నేషనల్ కాన్ఫరెన్స్ పార్టీ తరఫున పోటీ చేసిన 75 మంది అభ్యర్థులూ, ప్రత్యర్థులు లేకుండానే ఎన్నికయ్యారు. 1951 అక్టోబర్ 31వ తేదీ జరిగిన శాసనసభ తొలి సమావేశం భారతదేశంలో విలీనం కావడాన్ని లాంఛన ప్రాయంగా ఆమోదించింది.

1951 అక్టోబర్‌లో ఆరంభమయిన మొట్టమొదటి ఎన్నికల తతంగం 1952 ఫిబ్రవరి దాకా సాగింది. మొత్తం 489 లోక్‌సభ స్థానాలకూ; 22 రాష్ట్రాలలోని 3,823 శాసన సభ స్థానాలకూ ఎన్నికలు జరిగాయి. దాదాపు 75 రాజకీయ పక్షాల తరఫున 17,000 మంది అభ్యర్థులు పోటీ చేశారు. ఇండిపెండెంట్ అభ్యర్థులుగానే దాదాపు 6,000 మంది బరిలోకి దిగారు. కాంగ్రెస్ 363 పార్లమెంటు స్థానాలను గెలుచుకున్నది. కొన్ని మిత్రపక్షాలతో కలిసి కమ్యూనిస్టు పార్టీ 41 స్థానాలను గెలుచుకుని ప్రధాన ప్రతిపక్షమయింది. జవహర్ లాల్ నెహ్రూ ప్రధాన మంత్రిగా ఎన్నికయ్యారు.

# భాషా ప్రయుక్త రాష్ట్రాల అవతరణ

మే 6వ తేదీ డా॥రాజేంద్రప్రసాద్ రాష్ట్రపతిగానూ, డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ ఉపరాష్ట్రపతిగానూ ఎన్నుకోబడ్డారు. మే 12వ తేదీ పార్లమెంటు సమావేశమయింది. జి.వి మావ్లాంకర్ లోక్‌సభ తొలి స్పీకర్‌గా ఎన్నుకోబడ్డాడు. అంతకు ముందుఅంటే మార్చ్ 27వ తేదీ 216సభ్యులతో రాజ్యసభ ఏర్పాటయింది. కాంగ్రెస్ 18 రాష్ట్రాలలో ప్రభుత్వం ఏర్పాటు చేసింది.


డా॥ రాజేంద్రప్రసాద్

1952లో సోషలిస్టు పార్టీ అనే నూతన రాజకీయ పక్షం ఏర్పడింది. దేశ రాజకీయాలలో గాంధీజీ సిద్ధాంతాలకు ముఖ్యస్థానం కల్పించాలని మే నెలలో పాచ్‌మర్హీలో జరిగిన సభలో ఆ పార్టీ నాయకుడు జయప్రకాశ్‌నారాయణ్ ప్రకటించాడు. ఇది కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీకి మరింత చేరువయింది.సెప్టెంబర్‌లో రెండూ కలిసి 'ప్రజా సోషలిస్టు పార్టీ' ఏర్పడింది. బొంబాయిలో ఏర్పాటయిన సమావేశంలో ఆచార్య జె.బి. కృపలానీ అధ్యక్షుడుగానూ; జయప్రకాశ్ నారాయణ్,ఆచార్య నరేంద్రదేవ్,రాంమనోహర్ లోహియా, అశోక్ మెహతా వ్యవస్థాపక నాయకులుగానూ ఎన్నికయ్యారు.


జయప్రకాశ్ నారాయణ్

తెలుగు మాట్లాడే ప్రజలకు ప్రత్యేక రాష్ట్రం కావాలని అమరజీవి పొట్టి శ్రీరాములు నిరాహార దీక్ష ప్రారంభించాడు.దాంతో భాషా ప్రయుక్తరాష్ట్రాలు ఏర్పాటు చేయాలనే బలం పుంజుకున్నది. పొట్టి శ్రీరాములు డిసెంబర్‌లో ప్రాణత్యాగం చేశాడు. 1953 అక్టోబర్ 1వ తేదీ మద్రాసు రాష్ట్రం నుంచి 11 జిల్లాలను వేరు చేసి, కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పాటయింది. 1956వ సం॥ లో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సమయంలో హైదరాబాదు నుంచి మరో తొమ్మిది జిల్లాలను అందులో చేర్చడంతో– హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించింది.

1953లో కాశ్మీరు రాజకీయాలు కొత్తమలుపు తిరిగాయి. నేషనల్ కాన్ఫరెన్స్ మే నెల సమావేశంలో పాల్గొన్న ఎనిమిదిమంది నాయకులలో ఏడుగురు ప్రధాన మంత్రి షేక్‌అబ్దుల్లా సిద్ధాంతాలకు ఎదురు తిరిగారు. ఆయన పాకిస్థాన్‌తోరహస్యమంతనాలు జరుపుతున్నాడనే అభియోగం కూడా వచ్చింది. సదర్– ఇ– రియాజాత్ (గవర్నర్) ఆయన్ను పదవినుంచి తొలగించి బక్షీగులాం మహమ్మద్‌ను ప్రధాన మంత్రిని చేశాడు. షేక్ అబ్దుల్లా ఖైదు చేయబడ్డాడు.


షేక్ అబ్దుల్లా

నెహ్రూ పంచశీల సిద్ధాంత ప్రతిపాదన ఇండో–చైనా సంబంధాలలో నూతన అధ్యాయాన్ని సృష్టించింది. దేశ సరిహద్దులను, సమగ్రతను గౌరవించడం; సైనిక ఘర్షణకు స్వస్తి చెప్పడం; దేశ అంతర్గత వ్యవహారాలలో జోక్యం చేసుకోకుండా ఉండడం; సమానత్వం, పరస్పర సహకారం శాంతియుత సహజీవనం– అన్నవి పంచశీలసూత్రాలు.భారత ప్రధాని జవ

హర్‌లాల్ నెహ్రూ, చైనా ప్రధాని చౌ-ఎన్-లై పంచశీల ఒప్పందంలో 1954 జూన్ 28వ తేదీ సంతకం చేశారు. అక్టోబర్‌లో నెహ్రూ చైనాలో పర్యటించాడు.

1954 నవంబర్ 4వ తేదీ ఫ్రాన్స్ తన అధీనంలోవున్న పాండిచ్చేరి, మాహే, కారైక్కాల్, యానాం అనే నాలుగు ప్రాంతాలను వదులు కోవడంతో పాండిచ్చేరి కేంద్రపాలిత ప్రాంతం ఏర్పడింది. రెండేళ్ళ తరవాత అంటే 1956 మే 28వ తేదీ ఈ ఒప్పందంలో ఇండియా- ఫ్రాన్స్ దేశాలు సంతకం చేయడంతో అధికారమార్పిడి లాంఛనప్రాయంగా అమలులోకి వచ్చింది.



- సోమనాథ్‌లో నిర్మించబడిన నూతన ఆలయాన్ని రాష్ట్రపతి బాబురాజేంద్రప్రసాద్ 1951 మే 11వ తేదీ ఆవిష్కరించాడు.
- 1951 మార్చ్ 5వ తేదీ న్యూఢిల్లీలో ప్రథమ ఆసియా క్రీడోత్సవాలు జరిగాయి. ఈక్రీడలలో 11 దేశాలనుంచి దాదాపు 490 మంది క్రీడాకారులు పాల్గొన్నారు. జపాను అధిక పతకాలను సాధించింది. ఇండియా రెండవ స్థానం పొందింది.
- స్వతంత్ర భారతంలో 1951లో జరిగిన జనాభా లెక్కల సేకరణ ద్వారా దేశంలో దాదాపు 720 భాషలు వాడుకలో ఉండడం తెలియవచ్చింది.

# బయటి ప్రపంచంలో ....

- కృత్రిమ ఉపగ్రహాన్ని ప్రయోగించడంద్వారా మానవుడి అంతరిక్ష విజయం ఆరంభమయింది. 1957 అక్టోబర్ 4వ తేదీ సోవియట్ రూపొందించిన స్పుట్నిక్-1 భూమి పర్యావరణాన్ని దాటి అంతరిక్షంలోకివెళ్ళింది. నవంబర్ 3వ తేదీ స్పుట్నిక్ - 2 లైకా అనే కుక్కను తీసుకువెళ్ళింది. అమెరికా ప్రయోగించిన వేన్‌గార్డ్ రాకెట్ అంతరిక్షంలో పేలిపోయింది. తొలి వైఫల్యాలకు ఏమాత్రం నిరుత్సాహపడకుండా, పట్టుదలవదలకుండా ప్రయత్నించి, అమెరికా ఎక్స్‌ప్లోరర్ -1ని డిసెంబర్‌లో విజయవంతంగాప్రయోగించింది.

- సుప్రసిద్ధ హాస్యపాత్ర 'డెనిస్ ది మినేస్' అమెరికా వార్తాపత్రికలలో 1951 డిసెంబర్‌లో మొట్టమొదట ప్రవేశపెట్టబడింది.
- 1954 మే 6వ తేదీ రోజర్ బానిస్టర్ అనే ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ విద్యార్థి మొట్టమొదటిసారిగా ఒకమైలు దూరం 4 నిమిషాలలోగా (3:59.4) పరిగెత్తి రికార్డు సృష్టించాడు!
- అమెరికా అనహీమ్‌లోని డిస్నీల్యాండ్‌ను ప్రజలు చూడడానికి 1955 జూన్ 18వ తేదీ అనుమతించబడ్డారు.
- 'గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్' మొట్టమొదటి ప్రతి, లండన్‌లో 1955 ఆగస్ట్ 27వతేదీ విడుదల చేయబడింది.

# సోషలిస్టు సమాజ స్థాపన ప్రయత్నం!

మద్రాసు ఆవడిలో 1955 జనవరిలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ అరవైయవ సమావేశంలో-సోషలిస్టు సమాజ స్థాపన తన లక్ష్యంగా కాంగ్రెస్ ప్రకటించింది. ఫిబ్రవరిలో ప్రధాని నెహ్రూ ఆంధ్ర ప్రదేశ్ ఎన్నికల ప్రచారంలో పాల్గొని - దేశం మొత్తం మీద సోషలిస్టు సమాజ స్థాపనకు ప్రభుత్వం పాటు పడగలదని ప్రచారం చేశాడు.

ప్రపంచంలో రెండవ అగ్ర రాజ్యమైన సోవియట్ యూనియన్‌తో ఒక ఒప్పందంలో సంతకం చేయడం ద్వారా ఇండియా ఇతర దేశాలతో దౌత్యసంబంధాలు పెంపొందించుకోవడంలో ముందడుగు వేసింది. ఆ దేశం ఆహ్వానం మేరకు ప్రధాని నెహ్రూ 1955 జూన్‌లో సోవియట్‌యూనియన్‌లో దాదాపు 15 రోజులపాటు పర్యటించాడు. జూన్ 22వ తేదీ ఉభయదేశాలు సంయుక్త ప్రకటన విడుదల చేశాయి. పంచశీల సూత్రాలనుఅనుసరించడానికి అంగీకరిస్తూ, ఆర్థిక, వైజ్ఞానిక, సాంస్కృతిక రంగాలలో ప్రగతి సాధించడానికి, ఉభయదేశాల మధ్య సత్సంబంధాలు నెలకొల్పడానికి ఒప్పందం జరిగింది. నవంబర్‌లో ప్రెసిడెంట్ బుల్గానిన్, ప్రధాన మంత్రి కృశ్చేవ్ భారత్ పర్యటనకు రావడంతో ఈ ఒప్పందానికి మరింత బలం చేకూరింది.

1953లో రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ సంఘం ఏర్పాటు చేయబడి, 1955వ సెప్టెంబర్ 30వ తేదీ తన నివేదికను సమర్పించింది. అధిక సంఖ్యాకులు మాట్లాడే భాష ప్రాతిపదిక మీద 16 భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటు చేయవచ్చునని అది సిఫార్సు చేసింది.

1956 నవంబర్ 1 వ తేదీ ఆంధ్రప్రదేశ్, అస్సాం, ఉత్తర ప్రదేశ్, బొంబాయి, పంజాబు, పశ్చిమ బెంగాల్, మధ్య ప్రదేశ్, జమ్ము-కాశ్మీర్, బీహారు, ఒరిస్సా, రాజస్థాన్, మద్రాసు, మైసూరు, కేరళ రాష్ట్రాలు; ఢిల్లీ, అండమాన్ నికోబార్ దీవులు, లక్షదీవులు, త్రిపుర, మణిపూర్ కేంద్రపాలిత ప్రాంతాలు పునర్ వ్యవస్థీకరించబడ్డాయి.

1957 వ సం॥లో ప్రపంచంలోనే మొట్ట మొదటిసారిగా కేరళ రాష్ట్రంలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఎన్నికయింది. మొత్తం 126 శాసన సభా స్థానాలలో కమ్యూనిస్టు పార్టీ 60 స్థానాలు గెలుచుకున్నది. కమ్యూనిస్టు పార్టీ మద్దతు పొందిన ఐదుగురు ఇండిపెండెంట్లు కూడా ఎన్నికయ్యారు. కాంగ్రెస్‌కు 43 స్థానాలే లభించాయి. ఇ.ఎం. ఎస్. నంబూద్రి పాద్ ముఖ్య మంత్రి అయ్యాడు.



ఇ.ఎం. ఎస్. నంబూద్రి పాద్

ప్రజాస్వామ్యానికి మూలస్తంభంలాంటి గ్రామ పాలనకు సంబంధించిన పంచాయితీరాజ్ విధానం 1957లో ఆంధ్రరాష్ట్రంలో ప్రవేశపెట్టబడింది. మన దేశంలో పంచాయితీ రాజ్ విధానాన్ని ప్రవేశ పెట్టిన తొలి రెండు రాష్ట్రాలు-ఆంధ్రప్రదేశ్, రాజస్థాన్.

కాశ్మీరు సమస్య రగులుతూనే వచ్చింది. 1958 వ సం॥ప్రారంభంలో షేక్ అబ్దుల్లా జైలు నుంచి విడుదలయ్యాడు. 'ప్లెబిసైట్ ఫ్రంట్' నాయకత్వాన్ని చేపట్టాడు. అంతకు పూర్వం 'ప్లెబిసైట్ ఫ్రంట్' - కాశ్మీరు ఇండియాలో విలీనం కావడాన్ని నిరాకరించింది గనక- షేక్ ఇప్పుడు కాశ్మీరు విలీనాన్ని రద్దు చేయాలని కోరాడు. దేశద్రోహ నేరం కింద షేక్ మళ్ళీ ఖైదు చేయబడ్డాడు.

భారత సరిహద్దులోకి పాకిస్తాన్ చొరబాటు కారణంగా ఏర్పడిన కాశ్మీరు సమస్య పరిష్కారం కాకుం

డానే; మరొక వైపు నుంచి వేరొక చొరబాటును ఇండియా ఎదుర్కోవలసివచ్చింది. చిరకాలంగా స్నేహసంబంధాలు కలిగివున్న చైనాతోనే ఈ సమస్య వచ్చింది. ఖైదునూ, జైలుశిక్షనూ, శంకించి టిబెట్ మత నాయకుడు దలైలామా అక్కడి నుంచి ఇండియాకు తప్పించుకుని రావడమే చైనా ఆగ్రహానికీ, ఈ చొరబాటుకూ ముఖ్య కారణమయింది.

- న్యూజీలాండుకు చెందిన ఎడ్మండ్ హిల్లరీ, నేపాలుకు చెందిన షెర్పా టెన్సింగ్ నార్గే 1953 మే 29వ తేదీ ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించారు. ప్రపంచంలోకెల్లా ఎత్తయిన ఎవరెస్టు శిఖరం మీద భారత జాతీయ పతాకం ఆవిష్కరించబడింది. మన జాతీయ పతాకంతో పాటు బ్రిటన్, నేపాల్, ఐక్యరాజ్య సమితి పతాకాలను కూడా ఎవరెస్టు శిఖరం మీద ఎగురవేశారు!
- 1954 జూన్‌లో భారత ప్రభుత్వం భారత రత్న, పద్మ విభూషణ్, పద్మభూషణ్, పద్మశ్రీ జాతీయ పురస్కారాలను నెలకొల్పింది. భారతరత్న పురస్కార తొలి గ్రహీతలు సి.రాజగోపాలాచారి, డా॥ ఎస్.రాధాకృష్ణన్, సర్ సి.వి.రామన్.



- 1955లో సత్యజిత్‌రాయ్ దర్శకత్వం వహించిన 'పథేర్ పాంచాలి' చలనచిత్రం న్యూయార్క్‌లో ప్రదర్శించబడింది. భారతీయ చలనచిత్ర నిర్మాణంలో ఒక మైలురాయిగా ఆ చిత్రం ప్రశంసలనందుకున్నది.

# బయటి ప్రపంచంలో ....

- 1959 మే నెలలో అమెరికా అంతరిక్ష యానంలో నూతన విజయాన్ని సాధించింది. అమెరికా పంపిన శాటలైట్ భూమిని ప్రదక్షిణం చేసి జయప్రదంగా తిరిగివచ్చింది. శాటలైట్‌లో రెండుకోతులను కూడా పంపడం విశేషం. అవి 360 మైళ్ళఎత్తులో 1,700మైళ్ళుప్రయాణం చేసి వచ్చాయి!
- 1959 సెప్టెంబర్ 4వ తేదీ సోవియట్ శాటలైట్ ల్యూనిక్-2 చంద్రుడి చుట్టూ 35 గంటల సేపు ప్రదక్షిణ చేసి, అక్కడి వాతావరణంలోని 'రేడియేషన్' 'మేగ్నటిక్ ఫీల్డ్స్' సమాచారాన్ని సేకరించి పంపి చంద్రుడిలో దిగింది.

- ◆ 1958లో న్యూయార్క్‌కు చెందిన విలియం హిగ్గిన్‌బాతమ్ 'వీడియో గేమ్స్' కనుగొన్నాడు. అది మొదట 'టేబుల్ టెన్నిస్' క్రీడ. 'పాంగ్' అనేవారు. దానిని ఒక వ్యాపార క్రీడగా మార్చడానికి పద్నాలుగు సంవత్సరాలు పట్టింది.
- ◆ ప్రదర్శన కోసం వెస్ట్ మినిస్టర్ సెంట్రల్ హాల్లో ఉంచబడిన వరల్డ్ కప్ ఫుట్ బాల్ విజేతలకు అందజేసే, ది జూలిస్ రిమెట్ ట్రోఫీ దొంగిలించబడింది. సంచలనం సృష్టించిన ఈ దొంగతనం 1966 మార్చ్ 20వ తేదీ జరిగింది.ఒక వారం తరవాత అది దక్షిణ లండన్‌లోని ఒక పార్క్‌లో పడి ఉండడం ఒక పెంపుడుకుక్క కనుగొన్నది.

# పోర్చుగీసుల నుంచి గోవా విముక్తి

1959 మార్చ్ 17వ తేదీ టిబెట్‌ను వదిలి పెట్టిన దలై లామా పక్షం రోజుల తర వాత ఇండియా చేరు కున్నాడు. తనకూ, తన అనుచరులకూ ఆశ్రయం కోరాడు. ఉత్తర ప్రదేశ్‌లో ఆయన ఉండడానికి భారత ప్రభుత్వం తగిన ఏర్పాట్లు చేసింది. మానవతాదృష్టితో చేసిన ఈ సహాయం చైనాకు ఆగ్రహం కలిగించింది. చైనా ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం చేసుకున్నట్టు భారత్‌పై ఆరోపణ చేసింది. లడక్ నుంచి అస్సాం వరకు దాదాపు 132,000 కి.మీ. తమ దేశంలో భాగంగాసూచించే దేశపటాన్ని సెప్టెంబర్‌లో విడుదల చేసింది. ఇండియా దీనిని వ్యతిరేకించింది. చైనాతో చర్చలు జరపడానికి నిర్ణ యించింది,


దలైలామా

ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు సి.రాజగోపాలాచారి కొత్త రాజ కీయ పక్షాన్ని ఆరంభించాడు. 1959 జూన్‌లో మద్రాసులో జరిగిన అఖిల భారత వ్యవ సాయదారుల సమావేశం - నెహ్రూప్రభుత్వం ప్రవేశ పెట్టిన భూసంస్కరణలు, సహకార వ్యవసాయం మొదలైన సిద్ధాంతాలను తీవ్రంగా విమర్శించింది. కాంగ్రెస్‌లోని కొందరు నాయకు లతో స్వతంత్ర పార్టీ ఏర్పాటయింది. అక్టోబర్‌లో జరిగిన సమాయత్త సమావేశానికి 11 రాష్ట్రాల నుంచి 750 మంది ప్రతినిధులు హాజరయ్యారు. భూస్వాములు, మాజీ సంస్థానాధిపతుల నుంచి ఈ పార్టీకి ఆదరణ లభించింది.


సి.రాజగోపాలాచారి

మరాఠీ, గుజరాతీ మాట్లాడే ప్రజలకు విడి విడిగా రాష్ట్రాలు కావాలని బొంబాయిలో ఉద్యమం బయలుదేరింది. 1960 మార్చ్ 18వ తేదీ బొంబాయి శాసనసభలో బొంబాయి పునర్వ్యవ స్థీకరణ బిల్లు ఏకగ్రీవంగా నెరవేరింది. మే 1వ తేదీ బొంబాయి, అహ్మదాబాద్ రాజధానీ నగరాలుగా మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలు సాధికారంగా ఏర్పాటయ్యాయి.

ఇండియా–చైనా దేశాల మధ్య జరుగుతూన్న మంతనాల పర్యవసానంగా చైనా ప్రధాని చౌ–ఎన్–లై 1960లో రెండవసారిగా భారత్ పర్యటనకు వచ్చాడు. ఆక్రమిత ప్రాంతాలను అప్పగించడానికి చైనాపై ఒత్తిడి తీసుకురాని ఏ ఒప్పందంలోగాని సంతకం చేయరాదని అటు పాలకపక్షమైన కాంగ్రెస్, ఇటు ప్రతిపక్షాలు పట్టుబట్టాయి. రక్షణ మంత్రి వి.కె.కృష్ణమీనన్, చైనా విదేశాంగ మంత్రి మధ్య జరిగిన చర్చలు విఫలమయ్యాయి. తన ఆక్రమణలోవున్న అక్సాయ్ చిన్ ప్రాంతాన్ని వదులుకోవడానికి చైనా సుముఖత చూపలేదు.

1961 డిసెంబర్ 18 ఇండియాకు ఒక మరువరాని శుభదినం. భారత సైన్యం- పోర్చు గీసుల ఆధీనంలోవున్న గోవా, డయ్యూ, డామన్ ప్రాంతాలను 24 గంటలలో పట్టుకున్నది. మూడూ కలిసి గోవా కేంద్రపాలిత ప్రాంతం ఏర్ప డింది. వలసపాలన అవశేషాలు తొలగించడానికే ఈ సైనిక చర్యకు పూనుకున్నట్టు నెహ్రూ ప్రక టించాడు.

1962 వసం॥లోజరిగిన మూడవ సాధారణ ఎన్నికలలో కేంద్రంలోనూ, పలు రాష్ట్రాలలోనూ కాంగ్రెస్ అధికారం నిలబెట్టుకున్నది. లోక్‌సభలో కాంగ్రెస్ 361 స్థానాలను చేపట్టింది. భారత కమ్యూనిస్టు పార్టీ 29 స్థానాలు పొంది ప్రధాన ప్రతిపక్షంగా వచ్చింది. శాసన సభల మొత్తం 2,842 స్థానాలలో కాంగ్రెస్ 1,759 స్థానాలను గెలుచుకున్నది.కమ్యూనిస్టు పార్టీకి 153 స్థానాలు వచ్చాయి. స్వతంత్ర పార్టీకి 166 స్థానాలు, జన సంఘ్‌కు 116 స్థానాలు వచ్చాయి. ఏప్రిల్ 10వ తేదీ జవహర్‌లాల్ నెహ్రూ మళ్ళీ ప్రధాన మంత్రి అయ్యాడు.

- 1957 జనవరి 20వ తేదీ భారతదేశంలో మొట్టమొదటి- అణు పరిశోధక రియాక్టర్ 'అప్సర' ప్రారంభించబడింది.



- భారత దేశం 1957 ఏప్రిల్ 1వ తేదీ దశాంక పద్ధతిని ప్రవేశపెట్టింది. పైకంలో అతి చిన్న యూనిట్ నయాపైసా.
- జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినమైన నవంబర్ 14వ తేదీని బాలల దినంగా జరుపుకోవాలని నిర్ణయించారు.
- ఇండియాలోనే తొలి మహిళా మేయర్‌గా 1957లో తారా చెరియన్ (మద్రాసు) ఎన్నికయ్యారు.

## బయటి ప్రపంచంలో ....

- 1960 జూన్ 21వ తేదీ ప్రపంచం లోనే మొట్టమొదటి మహిళా ప్రధానిగా శ్రీమతి సిరిమావో బండార నాయకే శ్రీలంకలో అధికారం చేపట్టారు.
- 1961 ఏప్రిల్ 12వ తేదీ రష్యా ప్రయోగించిన శాటలైట్ వోస్టాక్ -1లో వ్యోమగామి యూరి గగారిన్ 1 గంటా 40 నిమిషాలలో 190 మైళ్ళ ఎత్తుకు వెళ్ళిరావడంతో- మనిషి అంతరిక్ష యానం కల నిజమయింది. ఒక్క నెల తిరిగే సరికి మే 5వ తేదీ అమెరికా తన వ్యోమగామి అలెన్ షెపార్డ్‌ను వ్యోమనౌక ఫ్రీడమ్ -7లో అంతరిక్షానికి పంపింది. జూలైలో వ్యోమగామి వర్జిన్ గ్రాహం, ఆగస్టులో వ్యోమగామి హెర్మన్ టిటోవ్ పూర్తి 24 గంటల సేపు అంతరిక్షంలో గడిపి వచ్చారు.

◆ వైద్యశాస్త్ర చరిత్రలో మొట్ట మొదటి సారిగా 1967వ సం॥లో గుండె మార్పిడి శస్త్ర చికిత్స జరిగింది. దక్షిణ ఆఫ్రికా కేప్ టౌనుకు చెందిన డా॥క్రిస్టియన్ బార్నార్డ్- 30 మంది డాక్టర్ల, నర్సుల సహకారంతో గుండె మార్పిడి శస్త్ర చికిత్సను విజయవంతంగా చేశాడు. గుండెను దానం చేసిన స్త్రీ కారు ప్రమాదంలో మరణించింది. గుండె గాయపడలేదు. కొత్త గుండెను పొందిన వ్యక్తి 18 రోజుల పాటు బతికి ఊపిరి తిత్తుల వ్యాధితో మరణించాడు.

# అంతమయిన నెహ్రూ శకం !

1962లో ఇండియా చైనాతో పూర్తిస్థాయి యుద్ధానికి దిగవలసి వచ్చింది. చైనా 1959లో టిబెట్‌ను కలుపుకున్నాక ఇండియా సరిహద్దును సమీపించి, చొరబాటుకు పాల్పడింది. అది మే-జూన్ నెలలలో జమ్మూ-కాశ్మీర్ ప్రాంతంలోని లడక్‌లో ప్రవేశించింది. ఆ సంవత్సరం మే నెలలో పాకిస్తాన్ గిల్ గిట్‌లో కొంత ప్రాంతాన్ని ఇచ్చి చైనాతో స్నేహం చేసింది. ఇండియా వ్యతిరేకించింది. అయినా సరిహద్దులకు సంబంధించినంతవరకు ఇండియాతో ఎటువంటి ఒప్పందమూ చేసుకోలేదని చైనా ప్రకటించింది. ఇండియాతో కాశ్మీరు విలీనం కావడాన్ని గుర్తిస్తూ 1956వ సం॥లో చౌ-ఎన్-లై చేసిన ప్రకటనకు ఇది పూర్తిగా విరుద్ధమైనది.

అక్టోబర్ 20వ తేదీ చైనా సైన్యం ఈశాన్య సరిహద్దులో ప్రవేశించింది. దాదాపు 30,000 సైనికులు అక్సాయ్ చిన్‌ను దాటి అస్సాం కేసి చొచ్చుకుని వచ్చారు. ఇండియా దిగ్భ్రాంతి చెందింది. విపరీతమైన చలి కారణంగా భారత సైన్యం చొరబాటును తిప్పికొట్టలేకపోయింది. భారతదేశం అత్యవసర పరిస్థితిని ప్రకటించింది. కృష్ణమీనన్ మంత్రి మండలినుంచి రాజీనామా చేశాడు. జవహర్‌లాల్ నెహ్రూ రక్షణమంత్రి పదవిని చేపట్టాడు. అమెరికా, బ్రిటన్, కెనడా, పశ్చిమ జర్మనీ, ఆస్ట్రేలియా దేశాలు ఆయుధసాయం అందించాయి. ఆ కారణంగా ఇండియా దురాక్రమణను అంతవరకు ఆపగలిగింది. నవంబర్21వ తేదీ చైనా ఏకపక్షంగా కాల్పుల విరమణను ప్రకటించింది. శ్రీలంక, బర్మా, కాంబోడియా, ఇండొనేసియా, ఘనా, అరబ్ రిపబ్లిక్ మొదలైన అలీనదేశాలు కొలంబోలో సమావేశమయ్యాయి. యుద్ధం ఆపడానికి అలీన దేశాల ప్రతిపాదనలను ఇండియా అంగీకరించింది. కాని, చైనా తిరస్కరించింది. చివరికి యుద్ధం ముగిసే సమయానికి లడక్ ప్రాంతంలో 36,000 చ.కి.మీ. ఈశాన్య సరిహద్దు ఏజన్సీ ప్రాంతంలో 5, 200 చ.కి.మీ. చైనా వశంలోనే ఉండిపోయాయి.


కె. కామరాజ్

పదేళ్ళకు పైగా అధికారపదవులలో కొనసాగిన నాయకులు, ఆ పదవులకు రాజీనామచేసి పార్టీని బలపరచడానికి కృషి చేయాలని ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు అప్పటి తమిళనాడు ముఖ్యమంత్రి కె.కామరాజ్ ఒక అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. 1963 ఆగస్టు 10వ తేదీ ఈ 'కామరాజ్ ప్లాన్' ఆరంభమయింది. ఆయన తన ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసి మిగిలినవారికి మార్గదర్శి అయ్యాడు. మొరార్జీ దేశాయ్, జగజ్జీవన్‌రాంతో సహా కేంద్రమంత్రి మండలిలోని ఆరుగురు మంత్రులు రాజీనామా చేశారు. ఐదు రాష్ట్రాల ముఖ్యమంత్రులు కూడా రాజీనామా చేశారు.

భారతదేశ రాజకీయాలలో, ప్రగతిలో కీలక పాత్ర వహించిన నెహ్రూ శకం 1964 మే 27వ తేదీ అంతమయింది. జనవరిలో భువనేశ్వర్‌లో ఏర్పాటయిన కాంగ్రెస్ సమావేశానికి హాజరయినప్పుడు నెహ్రూ అస్వస్థతకు లోనయ్యాడు. చికిత్స తరవాత కూడా ఆయన మామూలు స్థితికి కోలుకోలేకపోయాడు. అయినా నిర్విరామంగా పనిచేయడంమాత్రం వదులుకోలేదు. డెహ్రాడూన్‌లో

కొన్ని రోజులు విశ్రాంతి తీసుకుని మే 26వ తేదీ తిరిగి వచ్చాడు. మరునాడు తెల్లవారే సరికి ఆయన ఆరోగ్యం ఆందోళనకరంగా పరిణమించింది. మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో అంతిమ శ్వాస వదిలాడు. దేశం ఆయన్ను 1955వసం॥లో 'భారతరత్న' బిరుదంతో సత్కరించింది.ఆయనకు పిల్లలంటే అమిత ప్రేమ.ఆయన 'చాచా నెహ్రూ'గా పిల్లల ప్రేమను పొందాడు.

- 1958 సెప్టెంబర్ 27వ తేదీ కలకత్తాకు చెందిన మిహిర్ సేన్ 14 గంటలా 45 నిమిషాలలో ఇంగ్లీష్ ఛానల్‌ను ఈదాడు. డోవర్ నుంచి ఫ్రాన్స్‌లోని కలాసిస్ (34 కి.మీ) వరకు ఈదిన తొలిభారతీయుడు (ఆసియావాసి) గా ఆయన పేరుగాంచాడు.
- 1958 అక్టోబర్ 1వ తేదీ భారతదేశం తూకాలకూ, కొలమానాలకూ మెట్రిక్ పద్ధతిని ప్రవేశపెట్టింది.
- వినోబాభావే 1958 డిసెంబర్‌లో ఫిలిప్పైన్స్ నుంచి మేగెసెస్సే అవార్డును అందుకున్నాడు. ఆ అవార్డును అందుకున్న తొలిభారతీయుడు ఆయన.
- 1959 సెప్టెంబర్ 29వ తేదీ భారత దేశానికి చెందిన ఆరతిసాహ ఇంగ్లీష్ ఛానల్‌ను ఈదింది. ఆ ఛానల్‌ను ఈదిన తొలి ఆసియాఖండ మహిళ అనే పేరు తెచ్చుకున్నది.
- 1961లో ఉత్తమ క్రీడాకారులకు 'అర్జున అవార్డులు' ఏర్పాటు చేయబడ్డాయి.
- 1962 మే 13వ తేదీ డా.సర్వేపల్లి రాధాకృష్ణన్ రెండవసారిగా భారత రాష్ట్రపతి పదవిని చేపట్టాడు. ఆయన జన్మదినమైన సెప్టెంబర్ 5వ తేదీని యేటా ఉపాధ్యాయుల దినంగా జరుపుకోవాలని నిర్ణయించారు.
- ఆసియా ఖండంలో అతి పెద్దదీ, ప్రపంచంలో రెండవదీ అయిన 'బిర్లా ప్లానటోరియం' 1962 సెప్టెంబర్ 29వ తేదీ కలకత్తాలో ప్రారంభించబడింది.

# బయటి ప్రపంచంలో ....

- 1966 ఫిబ్రవరి 3వ తేదీ సోవియట్ లూనా-9 చంద్రుడిపై సురక్షితంగా దిగింది. మనిషి చంద్రుడిపై కాలు మోపడానికి ఇది దోహదం చేసింది. చంద్రుడి ఉపరితల చిత్రాలను ఈ ఉపగ్రహం భూమికి పంపింది.

- ◆ 1968లో డగ్లాస్ గిల్బర్ట్ కంప్యూటర్ ఆపరేషన్‌కు కావలసిన 'మౌస్'ను రూపొందించాడు.
- ◆ వైద్యశాస్త్రం, భౌతికశాస్త్రం, రసాయనిక శాస్త్రం, సాహిత్యం, శాంతితో పాటు ఆర్థిక శాస్త్రానికి కూడా నోబెల్ బహుమతి ఇవ్వాలని నిర్ణయించారు.
- ◆ 1973 మే 14వ తేదీ అమెరికా ఇద్దరు వ్యోమగాములతో 'స్కైలాబ్' ను అంతరిక్షంలోకి ప్రయోగించింది. వాళ్ళు 84 రోజులు అంతరిక్షంలో పరిశోధనలతో గడిపారు.
- ◆ 1976లో సీమోర్ క్రే అనే శాస్త్రజ్ఞుడు ఒక సూపర్-కంప్యూటర్‌ను రూపొందించాడు. క్రే-1 అని పేరుకలిగిన ఈ కంప్యూటర్ ఒక సెకనులో 2 కోట్ల 40 లక్షల కాల్క్యులేషన్స్ చేయగల సామర్థ్యం కలిగినది.
- ◆ అమెరికా పంపిన వ్యోమనౌక వైకింగ్-1 1976 జూలై 20వ తేదీ కుజగ్రహంలో దిగి అక్కడి చిత్రాలను భూమికి పంపింది.

# పాకిస్తాన్‌తో రెండవ యుద్ధం

జూన్ 2వ తేదీ కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ సమావేశమై లాల్ బహదూర్ శాస్త్రిని స్వతంత్ర భారతదేశ రెండవ ప్రధాన మంత్రిగా ఎన్నుకున్నది.జూన్ 9వ తేదీ ఆయన పదవీ బాధ్యతలు స్వీకరించాడు.



లాల్ బహదూర్ శాస్త్రి

1962 ఇండో-చైనా యుద్ధానంతరం కమ్యూనిస్టు నాయకుల మధ్య విభేదాలు తలెత్తాయి.కొందరు రష్యాకు సానుకూలంగానూ, మరికొందరు చైనా ఆలోచనా సరళికి అనుకూలంగానూ వ్యవహరించసాగారు. దాంతో 1964 ఏప్రిల్ 11వ తేదీ కమ్యూనిస్టు పార్టీ రెండుగా చీలిపోయింది.ఆగస్టులో పార్లమెంటులో ఏడుగురు సభ్యులు ఒక ప్రత్యేక బృందంగా ఏర్పడ్డారు. భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన ప్రతిపక్షం అన్న హోదాను కోల్పోయింది.

కాశ్మీరు నాయకుడు షేక్ అబ్దుల్లా 1964 ఏప్రిల్‌లో విడుదలయిన వెంటనే 'ప్లెబిసైట్ ఫ్రంట్'ను మళ్ళీప్రారంభించి-నిర్ణయం తీసుకోవడంలో ప్రజలకు హక్కు ఉండాలని కోరాడు. 1965 మార్చ్-ఏప్రిల్‌లో మక్కాకు యాత్ర వెళ్ళాడు. ఆ సమయంలో కాశ్మీరుకు స్వతంత్రం కావాలనే తన వాదానికి మద్దతునిచ్చే ఈజిప్టు ప్రెసిడెంట్ నాసర్‌నూ, చైనా ప్రధాని చౌ-ఎన్-లైనీ కలుసుకుని ఆలోచన జరిపాడు. ఇండియా ఆయన పాస్‌పోర్టును రద్దు చేసింది. ఏప్రిల్‌లో జమ్మూ-కాశ్మీర్ ఇండియారాజ్యాంగంలోకి తీసుకురాబడింది. 'సదర్-ఇ-రియాజాత్' పేరును గవర్నర్‌గానూ, వజీర్-ఇ-ఆజామ్ అనే పేరును ముఖ్యమంత్రిగానూ మార్చారు. యాత్ర నుంచి తిరిగి రాగానే షేక్‌ను అదుపులోకి తీసుకున్నారు.

1965లో ఇండియా, పాకిస్తాన్‌లు రెండవ సారి యుద్ధానికి దిగాయి. ఏప్రిల్‌లో భారత సరిహద్దులోని దాదాపు 2,000 చ.మైళ్ళ ప్రాంతాన్ని చైనాతో కలిపింది. పాకిస్తాన్ సైన్యం గుజరాత్‌లోని 'రాన్ ఆఫ్ కచ్'లో జొరబడింది. జూన్‌లో పాకిస్తాన్ సైనికులు భారత సరిహద్దులోకి ఎనిమిది మైళ్ళు చొచ్చుకు వచ్చి, మన సరిహద్దు సైనిక శిబిరాలపై దాడి జరిపారు.దాదాపు 7,000 మంది తీవ్రవాదులు కాశ్మీరు ప్రజలతో కలిసి పోయారన్న విషయం ఆగస్టులో మనదేశం దృష్టికి వచ్చింది. భారత సరిహద్దుల్లో పాకిస్తాన్ సేనలు కాల్పులు మొదలుపెట్టాయి.

సెప్టెంబర్ 1వ తేదీ భారత వైమానిక దళం కార్యరంగంలోకి దిగి శత్రు శిబిరాలను హడలగొట్టింది. సెప్టెంబర్ 4వ తేదీ పంజాబుప్రాంతంలో యుద్ధం ప్రారంభించి లాహోర్ కేసి బయలుదేరాయి. సెప్టెంబర్ 6వ తేదీ ప్రెసిడెంట్ అయూబ్ ఖాన్ భారతదేశంతో యుద్ధం ప్రకటించాడు. దాదాపు 100 పాటాన్ ట్యాంకులను నాశనంచేసి భారత సైన్యం కొన్ని ముఖ్యమైన విజయాలను సాధించింది.

సెప్టెంబర్ 11వ తేదీ ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి యూథాంట్ యుద్ధం విరమింపజేయడానికి ఇండియాకు వచ్చాడు. వెంటనే కాల్పులు విరమించడానికి ఉభయ దేశాలూ నిరాకరించాయి. అయినప్పటికీ, ఐక్యరాజ్య

భద్రతా సమితి మళ్ళీ మళ్ళీ విజ్ఞప్తి చేయడంతో సెప్టెంబర్ 23వ తేదీ యుద్ధం ఆగింది. పాకిస్తాన్ 710 చ.మైళ్ళ ప్రాంతాన్ని భారత్‌కు అప్ప గించింది. భారతదేశం 210 చ.మైళ్ళు పాకి స్తాన్‌కు అప్పగించింది.



- 1963 జనవరి 31వ తేదీ నెమలిని జాతీయపక్షిగా ప్రకటించారు.
- 1963 డిసెంబర్ 1వ తేదీ నాగాల్యాండ్ పరిపూర్ణ రాష్ట్రంగా రూపుదిద్దుకున్నది.



- 1964 మార్చ్ 22వ తేదీ కలకత్తాలో మొట్టమొదటి వింటేజ్ కార్ ర్యాలీ జరి గింది. యాభై వాహనాలు పాల్గొన్నాయి.
- 1964 డిసెంబర్‌లో జవహర్‌లాల్‌నెహ్రూ బొమ్మతో ప్రప్రథమంగా స్మారక నాణాలు ముద్రించబడ్డాయి.

# బయటి ప్రపంచంలో ....

- 1969 జూలై 21వ తేదీ మానవజాతి చరిత్రలోనే ఉజ్వలమైన రోజు. అమెరికా వ్యోమగామి చంద్రుడిపై కాలుమోపాడు. అది కల నిజమైన రోజు. చంద్రుడిపై కాలుమోపిన మొట్టమొదటి మానవుడు నీల్ ఆర్మ్ స్ట్రాంగ్. పద్ధెనిమిది నిమిషాల తరవాత వ్యోమగామి ఎడ్విన్ ఆల్డ్రిన్ కూడా చంద్రుడిపై కాలుపెట్టాడు.ఇద్దరూ కలిసి చంద్రుడిపై అమెరికా జెండాను పాతారు. చంద్రుడి ఉపరితలంలోని, రాయిరప్ప లనూ, మట్టినీ సేకరిస్తూ, ఫోటోలు తీస్తూ చంద్రుడిపై రెండుగంటల పాటు గడి పారు.అంతవరకు వ్యోమగామి మైకేల్ కోలిన్స్ 'మదర్ షిప్' కొలంబియాలోనే గడిపాడు. ఇద్దరు వ్యోమగాములతో విడి పోయి వెళ్ళిన 'ఈగిల్' మళ్ళీ వచ్చి 'మదర్‌షిప్'తో కలిసింది. ఆ తరవాత అపోలో-11 స్పేస్‌క్రాఫ్ట్ జూలై 24వ తేదీ తిరిగి భూమికి వచ్చి చేరింది. దీనిని గురించి ఆర్మ్‌స్ట్రాంగ్, ''మనిషికి ఇది ఒక చిన్న ముందడుగు కావచ్చు. అయితే, మానవజాతికి మాత్రం మహోన్నత ప్రగతి!'' అన్నాడు.
- 1969 మార్చ్ 25వ తేదీ జనరల్ యాహ్యాఖాన్ అధికారం చేజిక్కించు కోవడంతో పాకిస్తాన్‌లో సైనిక పాలన ఏర్పడింది. ప్రెసిడెంట్ అయూబ్‌ఖాన్ రాజీనామా చేశాడు.

# మహిళా ప్రధాని!

ఘర్షణలు తగ్గాక, సోవియట్‌యూనియన్‌చూపిన చొరవ కారణంగా ఇండియా, పాకిస్తాన్‌ల మధ్య స్నేహ ఒప్పందం కుదిరింది. ఉజ్బెకిస్తాన్‌లోని తాష్కంటులో భారత ప్రధాని లాల్ బహదూర్‌శాస్త్రి, ప్రెసిడెంట్ అయూబ్‌ఖాన్ 1966 జనవరి 4వ తేదీ నుంచి వారం రోజుల పాటు చర్చలు జరిపారు. పరస్పర స్నేహం, శాంతి సూచించే ఒప్పందం మీద జనవరి 10వ తేదీ ఉభయదేశాల నాయకులూ సంతకాలు చేశారు. ఆగస్టు 5కు పూర్వం ఉన్న స్థితికి ఉభయదేశాలూ తమ సేనలను ఉపసంహరించుకోవాలి; యుద్ధ ఖైదీలను అప్పగించాలి; దౌత్య సంబంధాలను పునరుద్ధరించాలి; పరస్పర సమస్యలను పరిష్కరించుకోవడానికి ఉన్నత స్థాయి చర్చలు జరపాలి; ఒక దేశం మరొక దేశం అంతరంగిక వ్యవహారాలలో జోక్యం చేసుకోకూడదు–అన్నవి ఆ ఒప్పందంలోని ముఖ్య అంశాలు.

ఆ ఒప్పందంలో సంతకాలు జరిగిన రాత్రే, దురదృష్టవశాత్తు లాల్ బహదూర్ శాస్త్రి తీవ్రమైన గుండెపోటుకుగురై తెల్లవారే సరికి కన్నుమూశాడు.

1964లో నెహ్రూ మరణించినప్పుడు తాత్కాలిక ప్రధానిగా వున్న గుల్జారీలాల్‌నందా మళ్ళీ ఆ పదవిని పొందాడు.

కె.కామరాజ్ ప్రోద్బలంతో కాంగ్రెస్ పార్టీ, శ్రీమతి ఇందిరా గాంధీని మూడవ ప్రధాన మంత్రిగా ఎన్నుకున్నది. 1966 జనవరి 23వ తేదీ ఆమె పదవీ ప్రమాణస్వీకారం చేసింది.

నవంబర్ 1వతేదీ పంజాబు రాష్ట్రం–పంజాబు, హర్యానా అని రెండు రాష్ట్రాలుగా విభజించబడింది. చండీఘడ్ ఉమ్మడి రాజధానీ నగరం.

1967 ఫిబ్రవరిలో నాలగవ సాధారణ ఎన్నికలుజరిగాయి. 283 స్థానాలను కాంగ్రెస్ గెలుచుకున్నది; స్వతంత్ర పార్టీ44, జనసంఘ్ 35, సి.పి.ఐ.23, సిపిఎం19, పి.ఎస్.పి. 13, మిగిలిన పార్టీలు 45 స్థానాలు గెలుచుకున్నాయి 35 స్థానాల్లో ఇండిపెండెంట్లు గెలుపొందారు. పంజాబు, రాజస్థాన్, బీహారు, ఒరిస్సా, ప.బెంగాల్, ఉత్తర ప్రదేశ్, కేరళ, తమిళనాడు రాష్ట్రాలలోనూ, ఢిల్లీలోనూ కాంగ్రెస్ మెజారిటీ కోల్పోయింది. మార్చ్ 12వతేదీ ఇందిరాగాంధీ మళ్ళీ ప్రధానిగా ఎన్నుకోబడ్డారు.


ఇందిరాగాంధీ

మాజీ కాంగ్రెస్ నాయకులు కొందరు, అంటే పార్టీకి రాజీనామా చేసిన వాళ్ళూ, పార్టీ నుంచి తొలగించబడిన వాళ్ళూ కలిసి 1967 మేలో భారతీయ క్రాంతిదళ్ అనే పార్టీని స్థాపించారు. డా॥పి.సి.ఘోష్, వి.కె.కృష్ణ మీనన్, జె.బి.కృపలానీ ఆ పార్టీ నాయకులు. కాంగ్రెస్‌లోని అధికార దాహం, లంచగొండితనం, నిరంకుశత్వం మొదలైన వాటిని వ్యతిరేకించి పోరాడడం; రాజకీయాలలో మళ్ళీ విలువలను పునరుద్ధరించడం ఆ పార్టీ లక్ష్యాలుగా చెప్పుకున్నారు.

1967 మే 13వ తేదీ డా॥ జాకీర్ హుస్సేన్ ఇండియాకు మూడవ రాష్ట్రపతి అయ్యాడు.

దాదాపు ఇదే సమయంలో పశ్చిమ బెంగాల్, డార్జిలింగ్ జిల్లా నక్సల్‌బారీ ప్రాంతంలోని అరవై గ్రామాలు భూసంస్కరణలను కోరుతూ సాయుధ పోరాటానికి దిగాయి.అచిరకాలంలోనే నక్సలైట్ ఉద్యమం ఆ ప్రాంతంలో బలమైన శక్తిగా రూపొందింది. క్రమంగా నక్సలైట్ల కార్యకలాపాలు


డా॥ జాకీర్ హుస్సేన్

ఆ గ్రామాల నుంచి పట్టణాలకూ, నగరాలకూ కూడా విస్తరిల్లాయి. నక్సలైట్ ఉద్యమం ఆంధ్రప్రదేశ్, కేరళ, బీహార్, పంజాబ్, ఉత్తర ప్రదేశ్‌రాష్ట్రాలలో కూడా తన ప్రభావం చూపింది!

❖ 1964లో ఆరవ పోప్ పాల్ బొంబాయికి వచ్చాడు. భారతదేశ పర్యటనకు వచ్చిన తొలి పోప్ ఆయన.


జి.శంకర కురూప్

❖ ప్రముఖ మలయాళ కవి జి.శంకర కురూప్ 1965లో మొట్టమొదటి జ్ఞానపీఠ అవార్డు గ్రహీత అయ్యాడు.

❖ సుప్రసిద్ధ భారతీయ ఈతగాడు మిహిర్ సేన్-1966 ఏప్రిల్ - అక్టోబర్ మధ్య కాలంలో ఐదు జలసంధులను, కాలువలను ఈది ప్రపంచ రికార్డు సృష్టించాడు. 96 కి.మీ. పూర్తి పనామా కాలువను 34 గంటలా 15 నిమిషాలలో ఈదిన మొట్టమొదటి వీరుడు ఆయన.

# బయటి ప్రపంచంలో ....

- పాకిస్తాన్‌లో జనరల్ యాహ్యాఖాన్ సాధారణ ఎన్నికలు ఆదేశించాడు. మాజీ విదేశాంగ మంత్రి జుల్ఫికర్ అలీ భుట్టో నాయకత్వం వహించిన 'పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ' పశ్చిమ పాకిస్తాన్‌లోనూ; షేక్ ముజిబుర్ రహమాన్ నాయకుడైన అవామీలీగ్ తూర్పు పాకిస్తాన్‌లోనూ మెజారిటీ సాధించాయి. అవామీలీగ్ తూర్పు పాకిస్తాన్‌కు స్వతంత్రం కోరడంతో వేలమైళ్ళ దూరంలో విడివిడిగా వున్న ఉభయ ప్రాంతాల మధ్య ఘర్షణలు, పోరాటాలు ఎక్కువయ్యాయి.

- తొమ్మిది మంది వ్యోమగాములతో సోయుజ్-9 అనే సోవియట్ స్పేస్‌క్రాఫ్ట్, 1970 జూన్‌లో అంతరిక్షంలో 17 రోజులు గడిపి వచ్చింది.

- 1971 నవంబర్ 14వ తేదీ నాసా (ఎన్.ఏ.ఎస్.ఏ) ప్రయోగించిన మారినర్ -9 అనే వ్యోమనౌక ప్రప్రథమంగా కుజగ్రహాన్ని ప్రదక్షిణ చేసింది. 85 శాతం గ్రహాన్ని పరిశీలించి ఫోటోలు తీసి భూమికి పంపింది. పక్షం రోజుల తరవాత సోవియట్ మార్స్-2 కుజ వాతావరణాన్ని చేరుకున్నది గాని, గ్రహ ఉపరితలంలో చెలరేగిన ధూళికి తట్టుకోలేక ముక్కలైపోయింది. అయినప్పటికీ మార్స్-3 డిసెంబర్ 2వ తేదీ కుజ గ్రహంలో విజయవంతంగా దిగింది. ఆ శాటలైట్ 20 సెకనుల పాటు సిగ్నల్స్ పంపింది.

# బంగ్లాదేశ్‌కు ఇండియా సైనిక సాయం

కాంగ్రెస్ పార్టీలో అంతర్గత విభేదాలు ఎక్కువయ్యాయి. ఉపప్రధాని మొరార్జీదేశాయ్ నిర్వహిస్తూ వచ్చిన ఆర్థికశాఖను ప్రధాన మంత్రి ఇందిరా గాంధీ స్వయంగా చేపట్టారు. 1969 జూలై 16వ తేదీ మొరార్జీదేశాయ్ తన ఉప ప్రధాని పదవికి రాజీనామా చేశాడు.

రాష్ట్రపతి 1969మే3వతేదీడా॥జాకీర్‌హుస్సేన్ మరణించడంతో ఉపరాష్ట్రపతిగావున్న వి.వి.గిరి- కాంగ్రెస్ పార్టీ సాధికార అభ్యర్థి నీలం సంజీవరెడ్డితో పోటీ చేసి రాష్ట్రపతిగా ఎన్నిక య్యాడు. ఉపరాష్ట్రపతి పదవిని చేపట్టిన జి.ఎస్. పథక్, ప్రత్యర్థి జె.శివ షణ్ముగం పిళ్లైను ఓడించాడు.



వి.వి.గిరి

పార్టీలోని అంతర్గత విభేదాలు రాష్ట్రపతి ఎన్నికల సమయంలో బయట పడ్డాయి. కాంగ్రెస్ రెండుగా చీలిపోయింది. ఇందిరాగాంధీ మద్దతుదార్లు కాంగ్రెస్ (ఆర్)గానూ తక్కిన వాళ్ళు నిజలింగప్ప అధ్యక్షతన కాంగ్రెస్ (ఓ) గానూ విడిపోయారు.

1971లో ఐదవ లోక్‌సభ ఎన్నికలు జరిగాయి. మొత్తం 518 స్థానాలలో కాంగ్రెస్ (ఆర్) 350 స్థానాలు గెలుచుకున్నది. మార్చి 18వ తేదీ ఇందిరాగాంధీ మళ్ళీ ప్రధాన మంత్రి అయ్యారు.

1971 డిసెంబర్‌లో ఇండియా పాకిస్తాన్ మళ్ళీ యుద్ధం చేయవలసి వచ్చింది. తూర్పు, పశ్చిమ పాకిస్తాన్‌ల మధ్య ఘర్షణలు మరీ హీనస్థితికి చేరుకున్నాయి. స్వతంత్రం కోరుతున్న తూర్పు పాకిస్తాన్‌లో దారుణ అణచివేత చర్యలు ఆరంభం కావడంతో అక్కడి ప్రజలు భయభ్రాంతులైపశ్చిమ బెంగాల్‌కు శరణార్థులుగా తరలి రాసాగారు. ఈ స్థితి పశ్చిమ బెంగాల్ ఆర్థికస్థితిని దారుణంగా దెబ్బతీసింది. పశ్చిమ బెంగాల్ మీదుగా పాకిస్తాన్ విమానాలు చొచ్చుకు రాసాగాయి.

నవంబర్ 23వ తేదీ భారత వైమానిక దళ విమానాలు మూడు పాకిస్తాన్ విమానాలను పడగొట్టాయి. మరునాడు- భారతసేనలు తూర్పు పాకిస్తానుకు వెళ్ళి, స్వతంత్రం కోసం పోరాడుతూన్న 'ముక్తి వాహిని'కి సాయపడాలని ఆదేశాలు జారీ చేయబడ్డాయి. డిసెంబర్ 3వ తేదీ భారతదేశంలోని తొమ్మిది వైమానికదళకేంద్రాల మీద పాక్ విమానాలు మెరుపు దాడులు జరిపాయి.ఇండియా, పాకిస్తాన్ మీద యుద్ధం ప్రకటించింది. అత్యవసర పరిస్థితి ప్రకటనకు పార్లమెంటు ఆమోదం తెలిపింది.

డిసెంబర్ 6వ తేదీ బంగ్లాదేశ్‌ను స్వతంత్ర దేశంగా ఇండియా గుర్తించింది. వివిధ జిల్లాలలో ఓడిపోవడంవల్ల బంగ్లాదేశ్‌లోని పాకిస్తాన్ సైన్యాన్ని లొంగిపొమ్మని హెచ్చరికలు జారీ అయ్యాయి. అదే సమయంలో పశ్చిమ దిశలోనూ భారతసేనలు విజయాలు సాధించాయి. డిసెంబర్ 12న పాక్ సేనలనులొంగిపొమ్మని మళ్ళీహెచ్చరికలువచ్చాయి. మూడు రోజుల తరవాత జనరల్ ఎ.కె.నియాజీ కాల్పుల విరమణను ప్రకటించాడు. జనరల్ జె.ఎస్.అరోరా పాక్‌సేనల నిబంధనారహిత లొంగుబాటును అంగీకరించాడు.డిసెంబర్17న ఇండియా ఏకపక్ష కాల్పుల విరమణను ప్రకటించింది. పాక్ ప్రెసిడెంట్ యాహ్యాఖాన్ దానిని అంగీకరించాడు.

1972 జనవరి 20న మేఘాలయ,అరుణాచల ప్రదేశ్‌లు పరిపూర్ణ రాష్ట్రాలుగా ఏర్పడ్డాయి. మరునాడు మణిపూర్, త్రిపుర రాష్ట్రాలూ; కేంద్ర పాలిత ప్రాంతమయిన మిజోరం ఏర్పాటు చేయబడ్డాయి.

1972 మార్చిలో 16 రాష్ట్రాల శాసన సభలకూ రెండు కేంద్రపాలిత ప్రాంతాలకూ ఎన్నికలు జరిగాయి. 14 రాష్ట్రాలలోనూ, ఢిల్లీ కేంద్రపాలిత

ప్రాంతంలోనూ కాంగ్రెస్ (ఆర్) మెజారిటీ సాంధిం చింది. గోవాలో మహారాష్ట్రవాది గోమంతక్ పార్టీ అధికారం చేపట్టింది. మేఘాలయాలో ఆల్‌పార్టీ హిల్ లీడర్స్ అసోసియేషన్ అధిక స్థానాలు గెలుచు కున్నది. మణిపూర్‌లో ఏ పార్టీకీ మెజారిటీ రాలేదు.

1972 జూలై 3వ తేదీ భారత ప్రధాని ఇందిరాగాంధీ, పాకిస్తాన్ ప్రధాని భుట్టో 'సిమ్లా ఒప్పందం'లో సంతకాలు చేశారు. బంగ్లాదేశ్‌లో పాకిసేనలు లొంగిపోవడంతో, భుట్టో పాకిస్తాన్‌లో మిలిటరీ పాలనను వ్యతిరేకించాడు. ఆయనప్రధాని అయ్యాడు. బంగ్లా దేశ్ అవతరణ తరవాత పరిస్థితు లను పరిశీలించడానికి సిమ్లా సమావేశం ఏర్పాటు చేయ బడినప్పటికీ చర్చలు మాత్రం కాశ్మీరు సమస్య చుట్టూ కేంద్రీకృ తమైపోయాయి.


భుట్టో

1973 ఏప్రిల్ 5వ తేదీ పొరుగు దేశమైన సిక్కిం పాలకుడు అక్కడ చట్టం, శాంతి భద్రతల పరి రక్షణకు ఇండియా సాయం కోరాడు. మరునాడే భారత సైన్యంలో ఒక దళమూ, సెంట్రల్ రిజర్వ్ పోలీసూ సిక్కింలో ప్రవేశించాయి. సిక్కింలో ప్రజాస్వామ్య వ్యవస్థను ప్రవేశ పెట్టాలని అక్కడి రాజకీయ పక్షాలు కోరాయి. అందుకు సిక్కిం మహా రాజాతో పాటు భారత ప్రభుత్వం కూడా అంగీక రించింది.

ఇండియన్ యూనియన్‌లో సిక్కిం విలీనం కావడానికి వీలుగా 1974 సెప్టెంబర్ 24వ తేదీ 35వ సవరణ బిల్లును లోక్‌సభ ఆమోదించింది. 1975 ఏప్రిల్ 26వ తేదీ సిక్కిం మనదేశంలో ఒక రాష్ట్రంగా రూపుదిద్దుకున్నది.

# కొన్ని ముఖ్యమైన సంఘటనలు...

- 1969 మార్చ్ 1వ తేదీ ఢిల్లీ-హౌరా స్టేషన్ల మధ్య గంటకు 130 కి.మీ. వేగంతో నడిచే 'సూపర్ ఫాస్ట్' రైలు ప్రవేశ పెట్టబడింది.
- 1969 డిసెంబర్‌లో నాలుగవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభించబడింది
- ప్రముఖ చలనచిత్ర నిర్మాత దాదాసాహెబ్ ఫాల్కే శత జయంతి ఉత్సవాలను పురస్క రించుకుని ఆయన పేరుమీదుగా-సినీ రంగానికి విశేష సేవలందించిన వారికి దాదాఫాల్కే అవార్డు ఏర్పాటు చేయబడింది. దేవికారాణి రోరిక్ తొలి అవార్డును అందు కున్నారు.
- 1969 డిసెంబర్‌లో గుజరాత్‌లోని గీర్ అడవులను ఆసియా సింహాల శరణాల యంగా ప్రకటించారు.
- రాష్ట్రపతిగా వి.వి.గిరి ఎన్నిక చెల్లదంటూ సుప్రీంకోర్టులో కేసు నడిచింది. చెల్లు తుందని కోర్టు తీర్పునిచ్చింది. 1970 ఏప్రిల్ 20,21 తేదీలలో మొట్టమొదటి సారిగా భారత రాష్ట్రపతి స్వయంగా న్యాయ స్థానానికి వెళ్ళి వాంగ్మూలం ఇచ్చాడు.
- 1970 సెప్టెంబర్ 2వ తేదీ భారత రాష్ట్ర పతి వి.వి.గిరి కన్యాకుమారిలో స్వామి వివేకానంద స్మారకమందిరాన్ని ప్రారం భించారు.
- అంతర్జాతీయ న్యాయమూర్తి నాగేంద్ర సింగ్, 1970లో ఆ న్యాయస్థానం తొలి 'ఇండియన్ ప్రెసిడెంట్' అయ్యాడు.

# దేశరాజకీయాలలో ఒడిదుడుకులు - కొత్త మలుపులు

అణుపరీక్షల విషయంలో ఇండియా తెగువతో వ్యవహరించింది. 1974 మే 18వ తేదీ రాజస్థాన్ ఎడారిలోని పోఖ్రాన్ ప్రాంతంలో భూగర్భంలో అణుబాంబు పరీక్షలు నిర్వహించింది. ఉదయం 8.15 గంటల సమయంలో భూమికి 107 మీ॥ లోతున అణుబాంబును పేల్చింది. అణుపరిశోధనల విషయంలో ఆ విధంగా ప్రపంచ అగ్రదేశాల ఆధిపత్యాన్ని అరికట్టి మన దేశం కూడా 'న్యూక్లియర్ క్లబ్'లో చేరింది. అయినప్పటికీ ఈ అణుపరిశోధనలన్నీ శాంతియుత ప్రయోజనాలకే అని ప్రపంచానికి చాటింది.

ఆగస్టు 24వ తేదీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ఐదవ భారత రాష్ట్రపతి అయ్యాడు.

ఆగస్టు 27వ తేదీ బి.డి.జెట్టీ ఉపరాష్ట్రపతి అయ్యాడు.

1975 ఫిబ్రవరి 25వ తేదీ షేక్ అబ్దుల్లా మళ్ళీ కాశ్మీరు ప్రధాని అయ్యాడు. ఇండియన్ యూనియన్ సర్వ సత్తాక అధికారం మినహా మిగిలిన విషయాలలో స్వయంగా నిర్ణయాలు తీసుకోవచ్చునని ఆయన కేంద్ర ప్రభుత్వంతో కుదుర్చుకున్న ఒప్పందాన్ని రాష్ట్రశాసనసభ ఆమోదించింది. 'ప్లెబి సైట్ ఫ్రంట్'ను రద్దు చేసి ఆయన నేషనల్ కాన్ఫరెన్స్‌లో చేరాడు.

చైనా, పాకిస్తాన్‌లతో యుద్ధం జరిగిన కాలంలో అంటే 1962లోనూ, 65లోనూ దేశంలో అత్యవసర పరిస్థితి అమలు చేయబడింది. 1975 జూన్‌లో మూడవసారి అత్యవసర పరిస్థితి అమలు చేయబడింది. అలహాబాదు హైకోర్టు జూన్ 12వ తేదీ ఇచ్చిన సంచలనాత్మకమైన ఒక తీర్పుతో ఇది ఆరంభమయింది. ఇందిరాగాంధీ 1971 ఎన్నికలలో గెలుపొందినది చెల్లదనీ, ఆమె మరో ఆరేళ్ళ వరకు ఎన్నికలకు పోటీ చేయకూడదనీ కోర్టు తీర్పునిచ్చింది. ప్రధాని రాజీనామాను కోరుతూ ప్రతిపక్షాలు జూన్ 13వ తేదీ రాష్ట్రపతి భవనం ముందు ప్రదర్శనలు జరిపాయి. జూన్ 24వ తేదీ అలహాబాదు హైకోర్టు తీర్పుకు సుప్రీంకోర్టు స్టే ఇచ్చింది. సి.పి.ఐ. తప్ప మిగిలిన ప్రతిపక్షాలన్నీ జయప్రకాశ్‌నారాయణ్ నాయకత్వంలో ఇందిరాగాంధీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జూన్ 25న పోరాటం జరపాలని నిర్ణయించాయి. దేశం సర్వసత్తాక స్వాతంత్ర్యానికి అంతర్గత అపాయం ఉందని, రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ఆ రాత్రే అత్యవసర పరిస్థితిని ప్రకటించాడు. జయప్రకాశ్ నారాయణ్, మొరార్జీదేశాయ్, ఎ.బి.వాజ్ పేయి, ఎల్.కె. అద్వానీ, చరణ్‌సింగ్, అశోక్ మెహతా మొదలైన నాయకులు ఖైదు చేయబడ్డారు. ఆర్.ఎస్. ఎస్. ఆనందమార్గ మొదలైన సంస్థలు నిషేధించబడ్డాయి. పత్రికలకు సెన్సారు విధించ బడింది. నవంబర్ 7వ తేదీ సుప్రీంకోర్టు ఇందిరాగాంధీ ఎన్నిక చెల్లుతుందని తీర్పు నిచ్చింది. కాని 1977 సాధారణ ఎన్నికలకు ముందే అత్యవసర పరిస్థితి తొలగించబడింది. కాంగ్రెస్ (ఒ), జన సంఘ్, భారతీయ లోక్ దళ్, సోషలిస్ట్ పార్టీ అనే నాలుగు పార్టీలు కలిసి జనతాపార్టీ ఏర్పాటు చేయాలని నిర్ణయించడంతో 1976వ సం॥ పార్లమెంటులో కొత్త రాజకీయ కూటమి రూపుదిద్దుకున్నది. తత్ఫలితంగా 1977వ సం॥ ఎన్నికలలో కాంగ్రెస్ నుంచి జనతాపార్టీ అధికారాన్ని చేజిక్కించుకున్నది.


ఫక్రుద్దీన్ అలీఅహ్మద్

[వచ్చే సంచికలో: అభ్యుదయ పథంలో అతి పెద్ద ప్రజాస్వామ్యం]



# నచ్చిన కోడలు

వెలిచేరు అనే గ్రామంలో, రాజయ్య అనే రైతుండేవాడు. అతడు సొంత వ్యవసాయం చేసుకుంటూ, అవసర సమయాల్లో ఇతరులకు సహాయపడుతూ, మంచివాడని పేరుతెచ్చుకున్నాడు.

అతడికి ఇద్దరు కుమార్తెలు. పెద్ద కూతురు రాణికి పెళ్ళి చేశాడు. రెండో కూతురు వాణి యుక్తవయసులో వుంది. ఆమెక్కూడా త్వరగా పెళ్ళి చేసెయ్యమని, భార్య రోజూ పోరుపెట్టసాగింది.

ఒకరోజున రాజయ్య శివాలయంలో శివుడికి అభిషేకం చేయిస్తున్నాడు. అతడు మండపంలో కూర్చుని, అభిషేకం చేయించడానికి వచ్చిన మరొక భక్తుడితో, "నువ్వు చాలా చిన్నవాడివి. వివరాలు బాగా తెలుసో లేదో! మన శివుడు చాలా మహిమగలవాడయ్యా! మన పూర్వీకుల్లో ఒకరు పొలం దున్నుతూంటే, లింగరూపంలో నాగటి కర్రకు తగిలాడట. వెంటనే ఆయన దున్నటం ఆపి, 'స్వామి వెలిశారు! స్వామి వెలిశారు!' అంటూ కేకలు పెట్టేసరికి, పెద్దలందరూ గుమిగూడి దేవాలయం కట్టారు. అందరూ రోజూ వచ్చి, 'వెలిశారు! వెలిశారు!' అని దణ్ణం పెట్టుకుని, పొలం పనులకు వెళ్ళేవారట. ఆ వెలిశారు అన్న పదమే చాలాకాలం గడిచాక, మనలాంటి వాళ్ళ నోటపడి, వెలిచేరు అని మారిపోయి, మన గ్రామానికి పేరుగా స్థిరపడిపోయింది. అభిషేకం చేయించి, ఏం కోరుకున్నా తీరుస్తాడు. మా అమ్మాయి వాణికి చక్కని పెళ్ళి సంబంధం కుదరాలని అభిషేకం చేయిస్తున్నాను!" అని చెప్పాడు.

ఇంతలో పూజారి వచ్చి, అభిషేకం పూర్తయిందని రాజయ్యకూ, పక్కనే వున్న భక్తుడికీ శఠగోపం పెట్టి ప్రసాదం ఇచ్చాడు. ఆ సమయంలో గుడిముందు ఒక గుర్రబ్బండి

డా॥ జొన్నలగడ్డ మార్కండేయులు



ఆగింది. బండివాడు, గుడి ముందర ఎవర్నో, "అయ్యా! రాజయ్య గారి ఇల్లు ఎక్కడో కాస్త చెబుతారా?" అని అడుగుతున్నాడు.

అప్పుడే ప్రసాదం పుచ్చుకుని రాజయ్య బయటికి వచ్చి, తన పేరు వినబడడంతో బండివాడి దగ్గరకు వెళ్ళి, "నేనే రాజయ్యను. సంగతేమిటి?" అని అడిగాడు.

ఆ వెంటనే బండిలోంచి ఒక వ్యక్తి దిగాడు. అతడు చాలా ఖరీదైన దుస్తులు ధరించి వున్నాడు. మెడలో పులిగోరు పతకం, నాలుగు వేళ్ళకూ ఉంగరాలతో — గొప్ప ధనికుడిలా వున్నాడు.

ఆయన, రాజయ్యకేసి పరీక్షగా చూసి, "ఒరేయ్, రాజయ్యా! నన్ను గుర్తుపట్ట లేదా?" అని అడిగాడు.

రాజయ్య, తనను ఒరేయ్ అంటున్న ఆ ధనికుడికేసి ఆశ్చర్యంగా పరకాయించి చూసి, ఆనందం పట్టలేక, "అరె, నువ్వు ముకుందానివి కదా?" అన్నాడు.

అవునన్నట్టుగా ముకుందం నవ్వాడు. ఈ ముకుందం ఒకప్పుడు — అంటే ఇరవై ఏళ్ళ క్రితం వెలిచేరులోనే వుండేవాడు. తర్వాత, గోపాలపట్నం అనే ఊరుకు, ఇల్లరికపుటల్లుడుగా వెళ్ళాడు. అత్తవారు బాగా డబ్బున్నవారు కావడంతోనూ, స్వయంకృషి కూడా వుండడంతోనూ, ముకుందం ధనవంతుడుగా చుట్టుపక్కల పేరుగాంచాడు.

రాజయ్య, ముకుందాన్ని ఆప్యాయంగా తన ఇంటికి తీసుకువెళ్ళి, భార్యను, కూతురు వాణిని పరిచయం చేశాడు. తర్వాత, అతిథి మర్యాదలు చేసి, "ఎప్పుడో ఇరవై ఏళ్ళ క్రితం, నాతో చదువుకున్న పాతజ్ఞాపకాల్ని తిరగతోడుకుంటూ, నా ఇంటికి వచ్చావు. కుచేలుడి ఇంటికి, శ్రీకృష్ణుడు వచ్చినంత ఆనందంగా వుంది. గ్రామంలో కాస్తో కూస్తో పలుకుబడి సంపాయించాను. నావల్ల జరిగే ఉపకారం ఏదైనా చేస్తాను," అన్నాడు.

ముకుందం నవ్వి, "రాజయ్యా, విను, నాకిద్దరు కొడుకులు. ఆడపిల్లలు లేరు. నాలాగే నా కొడుకులిద్దరూ కూడా వ్యవసాయం చేస్తున్నారు. వ్యవసాయం మాకు ఆరోప్రాణం. పాలేళ్ళు ఎంతమందున్నా, పొలం పనులు మేం స్వయంగా చూసుకుంటాం. అలాగే, నా భార్య కూడా తన లాగే వ్యవసాయదారుల్ని ఇష్టపడేవాళ్ళు రావాలని కోరుకుంది. ఆ విధంగా, భగవంతుడి దయవల్ల మాకు తగిన పెద్దకోడలు దొరికింది. రెండవవాడికి పిల్లను చూడడానికి, మీ పొరుగు గ్రామమైన వసంతవాడకు



బయలుదేరాను. చూడగా, నేనా గ్రామం వెళ్ళనవసరం లేకుండానే, మీఇంటికి రావడం చూస్తే, నీ చిన్నకూతురు వాణి, మా రెండో వాడికి తగిన ఇల్లాలు ; నా భార్య కోరుకున్న కోడలు అని, నాకనిపిస్తోంది. ఇది నేను మన స్ఫూర్తిగా అంటున్నమాట!'' అన్నాడు.

ఇది విన్న రాజయ్య ఆనందం పట్టలేక, ''కుబేరుడింటికి కోడలుగా, నా కూతురు వాణిని పంపగలగడంకన్న అదృష్టం ఇంకే ముంటుంది! నువ్వు అడిగినంతకాకపోయినా, కలిగినంతలో సంతోషంగా కట్నకానుక లిస్తాను,'' అన్నాడు.

ముకుందం, రాజయ్య భుజంతట్టి, ''నేను పేదవాడిగా నా భార్య ఇంటికి ఇల్లరికం వెళ్ళాను. కాని, నన్ను ఎన్నడూ అలా చూడ లేదు. మాకు కట్నకానుకలతో పనిలేదు. మా వ్యవసాయ కుటుంబంలో ఒకర్తెగా అల్లుకు పోవాలని, అంతే!'' అన్నాడు.

ఆ తర్వాత, తన భార్య,కొడుకు వచ్చి చూసుకున్నాక ముహూర్తాలు పెట్టుకుందా మని చెప్పి, బయల్దేరడానికి సిద్ధమయ్యాడు ముకుందం. ''అంతా,వెలిచేరు స్వామిదయ!'' అంటూ రాజయ్య సాగనంపడానికి,ముకుం దంతోపాటు బయటికి వచ్చాడు.

అప్పుడు, వాణి పెరట్లోంచి పరిగెత్తు కుంటూ వచ్చి, ''కొంచెం సేపట్లో పెద్ద వాన రావచ్చు! కొంచెం ఆగి వెళ్ళండి,'' అంటూ వాణి, రాజయ్యనూ, ముకుందాన్నీ పెరట్లోకి తీసుకువెళ్ళి, ''చూడండి! చీమలు తెల్ల గుడ్లు పట్టుకుని బారులు తీరి బయటకు వచ్చాయి. కోడి రెక్కలిప్పి ఆరబెట్టు కుంటు న్నది. తూనీగలు చిందరవందరగా ఎగురు తున్నాయి. ఇవన్నీ వర్షం రాకకు సూచనలని మన రైతుల నమ్మకం!'' అన్నది.

ముకుందం, ''ఆహా, నా ఇంటికి రాదగ్గ కోడలివి! మీ అత్తకు నువ్వు తప్పక నచ్చు

తావు,'' అంటూ ఎంతగానో మెచ్చుకున్నాడు.వాణి మాటలు నిజంచేస్తూ, కొద్ది సేపట్లోనే, ఒకమాదిరి వాన కురిసింది.

ముకుందం ఇంటికి వచ్చి, భార్యకు జరిగింది చెప్పి, ఆమెనూ, కొడుకునూ వెలిచేరు పంపాడు. వాణి, ముకుందం భార్యకు నచ్చింది. కొడుకు మొహం కూడా సంతోషంగా వుండడం చూసి, వాణిని తన కోడలుగా చేసుకోవాలని నిర్ణయించుకుంది.

ఆమె వాణితో, ''తెలియకడుగుతాను! మామతో పెద్దవాడు, చిన్నవాడు కలిస్తే లాభమా లేక గుడ్డివాడు, గూనివాడు కలిస్తే లాభమా? చెప్పితే, నాకు నచ్చిన కోడలివవుతావు,'' అన్నది.

వాణి నవ్వి, ''నిజంగా పొలానికి లాభం జరుగుతుందని నమ్మితే, మామతో పాటు ఎవరున్నా సరే, మన కోరిక తీరుతుంది!'' అన్నది.ఆ జవాబుకు ఆనందం పట్టలేక, ముకుందం భార్య,తన కొడుకుకేసి తల తిప్పి, ''ఒరే, చిన్నా! వాణి నాకు నచ్చిన కోడలు,'' అన్నది.

అప్పుడు చిన్నా వాణితో, ''సరే! నవగ్రహాలలో పెద్దవాడంటే సూర్యుడు, చిన్నవాడంటే బుధగ్రహం. అలాగే గుడ్డివాడంటే శుక్రగ్రహం. గూనివాడంటే శనిగ్రహం కదా! మామ అంటే చందమామ. చందమామతో సూర్యుడు, బుధుడు లేదా శుక్రుడు, శని కలిసినప్పుడు వాన వస్తుంది. మన గ్రహస్థితి బాగుంటే అలాగే జరిగి, పొలానికి అవసరం అయినప్పుడు, వాన పడుతుందని, గ్రహకూటమిని నమ్మే వ్యవసాయదారునికుటుంబానికి సూచించిన నిన్ను, అమ్మ మెచ్చుకుంది,'' అన్నాడు.

వాణి చిరునవ్వుతో, ''ఇది, అనుభవ ఆర్యోక్తి సూచకాలే తప్ప, వీటిమీద ఆధారపడకూడదు,'' అన్నది.

ముకుందం భార్య, అవునన్నట్టు తల వూపి, వాణిని మరింతగా పొగిడింది.

త్వరలోనే వాణికి, చిన్నాకు పెళ్ళి చేసిన రాజయ్య కుటుంబంతో, ముకుందం, ''రాజయ్యా! నచ్చిన కోడలిని తీసుకువెళ్తున్నాను,''అంటూ పరమానందంగా చెప్పాడు.



62. అశ్వమేధయాగం

# మహాభారతం

ధర్మరాజు రాజ్యాభిషిక్తుడైన తరవాత కృష్ణుడు చాలాకాలం హస్తినాపురంలో ఉండి, తన తండ్రి అయిన వసుదేవుణ్ణి చూడాలనిపించి, సాత్యకినీ, సుభద్రనూ వెంటబెట్టుకుని ద్వారకకు తిరిగి వచ్చాడు.

వసుదేవుడు కృష్ణుడి ద్వారా యుద్ధ వార్తలన్నీ తెలుసుకుని, తన మనమడైన అభిమన్యుడి చావు విని చాలా బాధపడ్డాడు.

ఈ లోపల, ధర్మరాజు అశ్వమేధానికి అవసరమైన ధనాన్ని హిమవత్పర్వతం నుంచి తీసుకురావటానికి సంకల్పించాడు. పాండవులు సేనలను కూర్చుకుని ధృతరాష్ట్రుడి వద్దా, కుంతీ గాంధారీల వద్దా అనుమతి తీసుకుని, హిమవత్పర్వతానికి బయలుదేరారు. వాళ్ళు నదులూ, అరణ్యాలూ, పర్వతాలూ దాటి హిమాలయం చేరి, మరుత్తుడు ధనం దాచి ఉంచిన చోట విడిశారు. వాళ్ళు ఒక రాత్రి అంతా ఉపవాసమూ,జాగరమూ చేస్తూ దర్భచాపల మీద కూర్చుని ఉండి, మర్నాడు శివుడికీ, కుబేరుడికీ, మణిభద్రుడికీ అర్చనలు చేసి,భూతబలులు ఇచ్చి, నిధిని తవ్వారు. అందులో అనేకమైన చెంబులూ,గిన్నెలూ, బిందెలూ,మూకుళ్ళూ, పళ్ళాలూ ఉన్నాయి. అన్నీ బంగారంతో చేసినవి. వాటిని తీసుకుపోవటానికి అంతులేని ఒంటెలూ,గుర్రాలూ,





వాహనాలూ,మనుషులూఅవసరమయ్యాయి. వాటితో పాండవులు హస్తినాపురానికి తిరిగి వచ్చారు.

అశ్వమేధానికి ప్రయత్నాలు ప్రారంభ మయినట్టు తెలిసి కృష్ణుడు, ప్రద్యు మ్నుణ్ణీ, సాత్యకి మొదలైన వారినీ వెంట బెట్టుకుని హస్తినాపురానికి బయలుదేరాడు. అతనితోబాటు సాంబుడూ, చారుధేష్ణుడూ, గదుడూ, కృతవర్మా,సుభద్రతో సహా బల రాముడూ కూడా బయలుదేరారు.

ధృతరాష్ట్రుడు విదురుడితో సహా ఎదురు వచ్చి, వారికి స్వాగతం చెప్పి, ఆహ్వానిం చాడు. కృష్ణుడు యుయుత్సుడి ఇంట బస చేశాడు.

ఈ సమయంలోనే ఉత్తర ప్రసవిం చింది. పుట్టిన పిల్లవాడు ఏడవలేదు, శవం లాగా ఉన్నాడు. అందరి సంతోషమూ అంతలోనే చల్లారిపోయింది. కృష్ణుణ్ణి పిలుచుకురావటానికి కుంతి బయలుదేరే సరికి, సాత్యకితో సహా కృష్ణుడే వచ్చాడు. సుభద్రా, ద్రౌపదీ మొదలైన స్త్రీలు ఏడుస్తు న్నారు.

కుంతి కృష్ణుణ్ణి చూసి గద్గద కంఠంతో, "కృష్ణా, నువ్వే కాపాడాలి. ఆ అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రం మూలాన నీ మేనల్లుడి కొడుకు చచ్చి పుట్టాడు! వీణ్ణి బతికించు," అన్నది.

అదే విధంగా సుభద్రా, ఉత్తరా, ద్రౌపదీ కృష్ణుణ్ణి వేడుకున్నారు. ఉత్తర బొత్తిగా పిచ్చి పట్టిన దానిలాగా అయిపోయి, మూర్ఛ పోయింది.

కృష్ణుడు తన పాదంతో ఆ పిల్లవాణ్ణి నిలు వునా నిమిరాడు. మరుక్షణమే పిల్లవాడిలో చైతన్యం వచ్చింది.వెంటనే అందరికీ ఆనందం కలిగింది. బ్రాహ్మణులు బిడ్డను ఆశీర్వ దించారు. పాండవ వంశం పరిక్షీణం కాకుండా కలిగాడు గనక, ఆ పిల్లవాడికి పరీక్షిత్తు అని కృష్ణుడు పేరుపెట్టాడు. ఆ పిల్లవాడు దిన దిన ప్రవర్ధమానుడు కాసాగాడు.

పరీక్షిత్తుకు నెల నిండే సరికి పాండవులు ధనంతో తిరిగి వచ్చారు. వారు వస్తున్నారని తెలియగానే హస్తినాపురాన్ని చక్కగా అలంక రించారు.యాదవులు పాండవులకు ఎదురు వెళ్ళారు. ఎక్కడ చూసినా నృత్యాలూ, గానాలూ జరుగుతూండగా పాండవులు హస్తినాపురం ప్రవేశించారు. వాళ్ళు తమకు మనమడు కలిగాడనీ, చచ్చి పుట్టిన ఆ శిశు వును కృష్ణుడు బతికించాడనీ విని, కృష్ణుణ్ణి అభినందించారు.

తరవాత ధర్మరాజు, వ్యాసుడి అనుమతీ, కృష్ణుడి అనుమతీ పొంది, అశ్వమేధయాగం చెయ్యటానికి ఉపక్రమించి, చైత్రపౌర్ణమి నాడు యజ్ఞదీక్ష పూనాడు. యాగాశ్వాన్ని అశ్వ లక్షణాలు తెలిసిన సూతులూ, బ్రాహ్మణులూ ఎన్నిక చెయ్యాలి. తరవాత దాన్ని దేశాల మీద వదలాలి. అది ప్రపంచమంతా తిరిగి రావాలి.

అశ్వమేధయాగం జరిగే కాలంలో ధర్మరాజు దీక్షలో ఉంటాడు గనక, భీముడు నకులుడి సహాయంతో రాజ్యం చూడటానికీ, అర్జునుడు యాగాశ్వం వెంట వెళ్ళి, దానికి రక్షకుడుగా ఉండటానికీ, సహదేవుడు కుటుంబ విషయాలు చూడటానికీ ఏర్పాటయింది.

అశ్వరక్షకుడుగా పోబోతున్న అర్జునుడితో ధర్మరాజు, ''అర్జునా, గుర్రాన్ని రక్షిస్తూ దాని వెంట వెళ్ళేటప్పుడు ఏ క్షత్రియులైనా నిన్ను ఎదిరిస్తే వారితో వైరం రాకుండా మసులుకోవాలి. మనం చేయనున్న ఈ యాగానికి వాళ్ళనందరినీ ఆహ్వానించు,'' అని చెప్పాడు.

ధర్మరాజు యజ్ఞదీక్ష వహించి స్వయంగా విడిచిన గుర్రం వెనకగా గాండీవం ధరించి అర్జునుడు బయలుదేరితే పురజనులు గుంపులు గుంపులుగా చూసి, ఆనందించారు. అర్జునుడి వెంట అశ్వపోషణ బాగా ఎరిగినవాడు, యజ్ఞవల్క్యుడి శిష్యుడు ఒకడూ, వేదపారగులైన కొందరు బ్రాహ్మణులూ, కొందరు క్షత్రియులూ కూడా బయలుదేరారు. యుద్ధంలో పాండవులు జయించిన భూమి అంతటా ఆ అశ్వం సంచారం చేసింది.

ఎవరితోనూ యుద్ధం చెయ్యవద్దని ధర్మరాజు చెప్పినప్పటికీ అర్జునుడు దారిలో





అనేక యుద్ధాలు చెయ్యవలసి వచ్చింది. అతన్ని అనేక చోట్ల కిరాతులూ, యవనులూ ఎదుర్కొన్నారు. అనేక మంది ఆర్యక్షత్రియులు కూడా అతన్ని ప్రతిఘటించారు. అన్ని యుద్ధాలలోనూ అర్జునుడు అవలీలగా గెలిచాడు.

భారత యుద్ధంలో అర్జునుడి చేత చచ్చిన త్రిగర్తుల కొడుకులూ, మనమలూ; అర్జునుడు యాగాశ్వం వెంట రక్షకుడుగా వస్తున్నట్టు విని, స్పర్థతో యుద్ధసన్నద్ధులై వచ్చి, అశ్వాన్ని పట్టుకోవటానికి వచ్చారు.

అర్జునుడు వాళ్ళతో మంచిగా మాట్లాడబోతే వాళ్ళు అతన్ని తమ బాణాలతో కొట్టారు. త్రిగర్తుల నాయకుడైన సూర్యవర్మతో అర్జునుడు యుద్ధం చెయ్యవలిసి వచ్చింది. అతను సూర్యవర్మనూ, కేతుధర్ముడు అనేవాణ్ణీ, ధృతవర్మ అనేవాణ్ణీ, ఇంకా పద్ధెనిమిది మంది త్రిగర్తులనూ చంపిన మీదట మిగిలిన వాళ్ళు అతనికి లోబడ్డారు.

అలాగే ప్రాగ్జ్యోతిషపురంలో భగదత్తుడి కొడుకు వజ్రదత్తుడు అర్జునుడిపై యుద్ధం చేశాడు. అర్జునుడు అతన్ని ఓడించి కూడా, చంపక విడిచిపెట్టుతూ అతన్ని అశ్వమేధ యాగానికి ఆహ్వానించాడు.

తరవాత అతనికి సైంధవులతో యుద్ధం జరిగింది. అర్జునుడు ఆ సైంధవుల నందరినీ ఓడించాడు. భారత యుద్ధంలో అర్జునుడి చేత చచ్చిన సైంధవుడి భార్య దుశ్శల ధృతరాష్ట్రుడి కూతురు. ఆమె కొడుకు సురథుడు అర్జునుడు గుర్రం వెంట వస్తున్నాడని వింటూనే భయంతో ప్రాణాలు విడిచాడు.

ఇప్పుడు దుశ్శల తన మనమణ్ణి, పసివాణ్ణి, ఒక రథంలో పెట్టి అర్జునుడి వద్దకు తెచ్చి, ''వీడు కూడా నీ మనమడు పరీక్షిత్తులాటివాడే. వీణ్ణి చూసి, ఈ సైంధవులందరినీ క్షమించు. వీడి తాత మీకు చాలా ద్రోహం చేశాడు, అది మరిచిపో,'' అన్నది.

అర్జునుడు తనకు చెల్లెలైన దుశ్శలను కౌగలించుకుని, ఆమెనూ, ఆమె మనమణ్ణీ ఇంటికి పంపేసి, తాను గుర్రంతో బాటు ముందుకు సాగాడు.

కాలక్రమాన అశ్వం మణిపురం చేరింది. అప్పుడు మణిపురాన్ని ఏలుతున్నవాడు బభ్రువాహనుడు. అతను అర్జునుడికీ, చిత్రాంగదకూ పుట్టినవాడు. తన తండ్రి తన దేశంలోకి వచ్చాడని విని బభ్రువాహనుడు కొంతమంది బ్రాహ్మణులను వెంటబెట్టుకుని అర్జునుణ్ణి చూడటానికి ఉత్సాహంతో వచ్చాడు.

అర్జునుడికి అతని ప్రవర్తన చూసి కోపం వచ్చి, "నువ్వు క్షత్రియుడివికావా? నేను చుట్టపు చూపుగా రాలేదు. అస్త్రాలు ధరించి యాగాశ్వాన్ని రక్షిస్తూ వచ్చాను. వీరుడివైతే అశ్వాన్ని పట్టి, నాతో యుద్ధం చెయ్యాలి గాని,తియ్యగా మాట్లాడటానికి వస్తావా?" అన్నాడు.

అప్పుడు ఉలూచి అక్కడికి వచ్చి, బభ్రువాహనుడితో, "నాయనా, నేను ఒక నాగ స్త్రీని. నీకు తల్లిని. నీ తండ్రి యుద్ధ దుర్మదంతో ఉన్నాడు. యుద్ధం చేసి అతన్ని మెప్పించు," అన్నది.

బభ్రువాహనుడికి పౌరుషం వచ్చింది. అతను యుద్ధవేషం ధరించి, రథం ఎక్కి అర్జునుడి పైకి యుద్ధానికి వచ్చాడు. మహా దారుణంగా యుద్ధం చేసి, ఇద్దరూ మూర్ఛపోయారు. చిత్రాంగద వచ్చి, తన భర్తా, కొడుకూ కూడా పడిపోవటం చూసి ఏడవ సాగింది. కొంతసేపటికి బభ్రువాహనుడు తేరుకుని, అర్జునుడి కోసం ఏడుస్తున్న తన తల్లిని చూసి, తాను చేసిన పనికి పశ్చాత్తాప పడి, ప్రాయోపవేశం చేశాడు.

అప్పుడు ఉలూచి అతన్ని సమీపించి, "పిచ్చివాడా, నీ తండ్రి నీ చేతిలో చచ్చాడనుకుంటున్నావా? అతన్ని ఎవరూ జయించలేరు. నేను నా మాయచేత నీకు అలాటి భ్రమ కలిగించాను.ఈ మణిని తీసుకుపోయి అతనికి తాకించు. వెంటనే లేస్తాడు,"అన్నది. బభ్రువాహనుడు మణిని తాకించగానే అర్జునుడు నిద్రలేచినట్టు లేచి కూర్చున్నాడు.

అర్జునుడు బభ్రువాహనుణ్ణి కౌగలించుకుంటూ ఉలూచి, చిత్రాంగదలు అక్కడే



ఉండటం చూసి చాలా ఆనందించాడు. అతను వాళ్ళను, "ఈ యుద్ధరంగానికి మీరెందుకు వచ్చారు?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

దానికి ఉలూచి, "అర్జునా, నువ్వు భీష్మణ్ణి అక్రమంగా చంపటం చేత నీకు పాపం చుట్టుకున్నది. అది పరిహారం కావటానికి నేను నిన్ను నీ కొడుకు చేత చంపించాను," అన్నది.

అర్జునుడు ఈ మాట విని సంతోషించి, బభ్రువాహనుణ్ణి అశ్వమేధయాగానికి ఆహ్వానించాడు. బభ్రువాహనుడు ఒకరాత్రి తనతో తన ఇంట అతిథిగా ఉండమని అర్జునుణ్ణి ఆహ్వానించాడు.కానిఅర్జునుడుతానుగుర్రం వెంట తిరగక తప్పదన్నాడు.

యాగాశ్వం సముద్రం దాకా వెళ్ళి,ఇంద్రప్రస్థానికి తిరిగి రాసాగింది. అది మగధ రాజ

ధాని అయిన రాజగృహం చేరింది. అక్కడ రాజుగా ఉన్న మేఘసంధి అనేవాడు అర్జునుడి మీదికి యుద్ధానికి వచ్చి, యుద్ధం చేసి, అర్జునుడి చేతిలో ఓడిపోయాడు.

అర్జునుడు అతనితో, ''చిన్నవాడివైనా చక్కగా యుద్ధం చేశావు. నిన్ను చంపటం నా కిష్టం లేదు. వచ్చే చైత్రపౌర్ణమికి మా అన్న ధర్మరాజు అశ్వమేధయాగం చేయబోతున్నాడు. దానికి నువ్వు రావాలి,'' అన్నాడు.

ఈ విధంగా అర్జునుడు గుర్రం వెంబడి పోతూ మ్లేచ్ఛులతోనూ,ఏకలవ్యుడి నిషాదులతోనూ,శకుని కొడుకైన గాంధార రాజుతోనూ, ద్రావిడులతోనూ, ఆంధ్రులతోనూ, ఓఢ్రులతోనూ యుద్ధాలు చేసి అందరినీ గెలిచి, హస్తినాపురానికి తిరిగివచ్చాడు.

చైత్రపౌర్ణమి తిరిగి రాబోతున్నది. ఒక మాసం ముందు నుంచీ యాగప్రయత్నాలు జరిగాయి.

యాగానికి అంతులేని జనం వచ్చారు. వారిలో అనేక మంది వేదవేత్తలూ, రాజులూ ఉన్నారు. కృష్ణ బలరాములు తమ వెంట సాత్యకినీ, ప్రద్యుమ్నుణ్ణీ, సాంబుణ్ణీ, గదుణ్ణీ, కృతవర్మనూ, ఇతర ప్రముఖ యాదవులనూ తెచ్చారు. చిత్రాంగదనూ, ఉలూచినీ వెంట బెట్టుకుని బభ్రువాహనుడు వచ్చాడు.

అశ్వమేధయాగం చాలా వైభవంగా జరిగింది. ధర్మరాజు వచ్చిన వారిలో కొందరికి గొప్పగా దానాలు చేశాడు.అందరూ యజ్ఞాన్ని మెచ్చుకుని, ధర్మరాజు చేసిన దానాలను కీర్తిస్తున్నారు. ఆ సమయంలో ఒక ముంగిస అక్కడికి వచ్చి, ''మీరంతా ఈ యజ్ఞాన్ని మెచ్చుకుంటున్నారు గాని, ఉంఛవృత్తితో జీవిస్తూ కురుక్షేత్రంలో నివసించిన ఒక ముని చేసిన పేలపిండి దానం ఇంతకన్న ఎంతో గొప్పది,'' అన్నది.

ముంగిస అన్న ఈ మాటలకు అందరూ ఆశ్చర్యపోయి, ''నువ్వు ఎవరు? ఎక్కడి నుంచి వస్తున్నావు? ఇంత శాస్త్రోక్తంగా జరిగిన యాగంలో నువ్వు ఏం వంక కని పెట్టావు? నిజం చెప్పు,'' అని అడిగారు.





# కొడుకు బాధ్యత

ఒకప్పుడు శ్రీధరపురాన్ని,దేవసేనుడనేరాజు పాలించేవాడు. ఆయన చాలా ధర్మబద్ధుడనీ, ఎంతో రాజనీతి ఎరిగినవాడనీ, ప్రజలు చెప్పుకునేవారు.

ఆయనకు వినీతసేనుడనే కొడుకున్నాడు. అతడు క్షత్రియ విద్యలన్నిటా ఆరితేరిన వాడు. స్వతహాగా తెలివైనవాడూ, వివేకీ. రాజు దేవసేనుడు, త్వరలో కొడుక్కు రాజ్య భారాన్ని అప్పగించాలనుకున్నాడు. అయితే ముందుగా, రాజ్యపాలనా విషయాలపట్ల అతడి ప్రవర్తనాతీరు ఎలా వుంటుందో పరీక్షించి చూడాలని భావించాడు.

ఒకనాడు దేవసేనుడు, కొడుకును తన వెంట సభకు తీసుకుపోయాడు. సభ ప్రారంభంకాగానే మంత్రి,ఆయనతో,''మహారాజా, తమ దర్శనం కోసం, ఒక తల్లీ కొడుకులు వచ్చారు,'' అని చెప్పాడు.

మంత్రి ఇలా చెప్పగానే, అక్కడ నిలబడి వున్న గోవిందుడు, సీతమ్మ అనే వాళ్ళువచ్చి రాజుకు నమస్కరించారు.

''మీరేం చెప్పుకోవడానికివచ్చారు? ఏమిటి మీ సమస్య? చెప్పండి,'' అని అడిగాడు రాజు.

ఆ ప్రశ్నకు గోవిందుడు, ''మహా ప్రభూ! మాది పేదకుటుంబం. రెక్కాడితే గాని డొక్కాడనిపరిస్థితి. నాకు ముగ్గురుబిడ్డలు. నాభార్యా, నేనూ కలిసి పనిచేసినా, బతుకు భారంగానే గడుస్తున్నది. ఈ పరిస్థితిలో, ఏ పనీ చేయలేని, ఈ ముసలిదాన్ని పోషించడం నావల్ల కాదు. పైగా, ఎప్పుడూ కడుపునొప్పి, కాలునొప్పి అంటూ అనారోగ్యంతో బాధపడుతూవుంటుంది. పూటకే గతిలేని వాణ్ణి వైద్యం ఎలా చేయించగలను.అందుకే, నగరంలోవున్న వృద్ధాశ్రమంలో చేరమంటున్నాను. కాని, ఎంత చెప్పినా ఈముసలిది నామాట అసలు వినడంలేదు. మీరైనా చెప్పి కాస్త మందలించండి, ప్రభూ!'' అన్నాడు.

దానికి సీతమ్మ, రాజుతో, ''ప్రభూ! తమరు కన్నతల్లిబాధ అర్థంచేసుకోగలరు.

కె.మాధవి

శరీరంలో ఓపిక వున్నన్నాళ్ళూ కష్టపడి పని చేశాను. ఇప్పుడు నాలో శక్తి సన్నగిల్లింది, పనిచేయలేను. అందుకని, కొడుకూ, కోడలూ, మనవళ్ళూ—ఇంతమంది వుండికూడా, నన్ను ఎక్కడో ఒంటరిగా అనాధబతుకు బతకమంటే, ప్రాణం కడబట్టినట్టవుతున్నది. సరే, ప్రభూ! ఇంతకాలం నా కొడుక్కు భారంగా వున్నందుకు, నాకేదైనా శిక్ష విధించండి!'' అంటూ కంట నీరు పెట్టుకున్నది.

అంతావిన్న రాజు దేవసేనుడు, పక్కనే వున్న కొడుకుకేసి సాలోచనగా చూశాడు. ఇంతసేపూ వినీతసేనుడు, ఆ తల్లీకొడుకుల కేసే పరీక్షగా చూస్తున్నాడు.

రాజు, కొడుకు వినీతసేనుడితో చిన్నగా, ''వినీతా, ఈ తగవు విషయం నాకేమీ బోధపడడంలేదు. నువ్వే ఏదైనా ఆలోచించి తీర్పు చెప్పి పంపించు,'' అన్నాడు.

ఇందుకు వినీతసేనుడు, ''ఇందులో బోధపడక పోవడమంటూ ఏమున్నది, నాన్నగారూ! గోవిందుడు చెప్పింది నిజమే. ఇప్పుడున్న అతడి ఆర్థికపరిస్థితుల్లో చేయగలిగింది అంతే!'' అన్నాడు.

తర్వాత, వినీతసేనుడు, గోవిందుడికేసి తల తిప్పి, ''నువ్వు అంతోఇంతో చదువుకున్నవాడివనుకుంటాను! తల్లిదండ్రుల్ని వాళ్ళ జీవితాంతం పోషించాలని, ఏగ్రంథంలోనైనావున్నదా?'' అని అడిగాడు.

''లేదు, ప్రభూ, లేదు! అంతేకాదు; మనం అనేక రకాలైన జంతువుల్నీ, పక్షుల్నీ చూస్తున్నాం. పిల్లలకు రెక్కలువచ్చి, తమ ఆహారాన్ని తాము సంపాదించుకోగలిగేవరకే



వాటిని సాకుతాయి. అవి ఎగిరిపోగానే, తమ దారి తాము చూసుకుంటాయి. అంతే గాని, ఇంతకాలం మిమ్మల్ని పోషించాం. ఇప్పుడు రెక్కలు వచ్చాయి గనక మమ్మల్ని పోషించండి! అంటూ వెంట పడతాయా?'' అన్నాడు గోవిందుడు.

''పడవు! నువ్వన్నది నిజమే. అయితే, నాదొక ప్రశ్న, గోవిందూ!'' అన్నాడు వినీతసేనుడు.

యువరాజు, తల్లివిషయంలో తనను సమర్థిస్తున్నాడని గోవిందుడు, ''అడగండి, ప్రభూ!'' అన్నాడు చేతులు జోడిస్తూ.

ఆ వెంటనే వినీతసేనుడు, ''నువ్వు మనిషివా లేక పశుపక్ష్యాదుల్లో ఒకడివా? బాగా ఆలోచించి చెప్పు,'' అన్నాడు.

''మనిషినే, ప్రభూ!'' అన్నాడు గోవిందుడు కలవరపడుతూ.

''మనిషివైతే ఇప్పటికైనా నీతప్పుగ్రహించి, నీతల్లిని ఇంటికి తీసుకుపో. కలిగినదాంట్లో కలిసి జీవించండి. ప్రాణికోటిలో మానవజన్మ ఎంతో ఉత్తమమైనది. అనేక సందర్భాలలో మనిషి ప్రత్యుపకారం ఆశించకుండానే, తోటివాణ్ణి కష్టాల్లో ఆదుకుంటాడు. ఇక్కడ నువ్వు ఆదుకోవలసింది కేవలం సాటిమనిషిని కాదు; నిన్ను నవమాసాలూ మోసి కనిపెంచి, నిన్నింతవాణ్ణి చేసిన మాతృదేవతను! అర్థమైందా?'' అని అడిగాడు వినీతసేనుడు.

వినీతసేనుడి మాటలువిన్న గోవిందుడికి, ఒక్కసారిగా కళ్ళు తిరిగినట్టనిపించింది. అతడు, తల్లిపట్ల తన కిరాతక ప్రవర్తనకు క్షోభపడి పోతూ, ''అమ్మా! క్షమించు,'' అంటూ తల్లి పాదాల మీద పడ్డాడు.

సీతమ్మ ముందు కొడుకునూ, తర్వాత వినీతసేనుడినీ, ''నూరేళ్ళు చల్లగా వర్ధిల్లు, నాయనా!'' అంటూ దీవించింది.

ఈ తీర్పు విన్న రాజు దేవసేనుడికి, తన కొడుకు ఎంతగొప్ప న్యాయధర్మ సూక్ష్మాలు ఎరిగిన ప్రజ్ఞావంతుడో అర్థమైంది. ఆ తర్వాత కొద్దికాలనికే వినీతసేనుడి రాజ్య పట్టాభిషేకం వైభవంగా జరిగింది.




ఇదొక చందమామ కానుక!
అజేయుడు గరుడుడు!
2
చిత్రాలు:పాణి
రాజు మహేంద్రదేవుడి పాలనలో చంద్రపురి రాజ్యం సుఖశాంతులతో వర్ధిల్లేది. ప్రధానమంత్రి ఆకస్మిక మరణానంతరం- ఆయన కుమారుడు ఆదిత్యుణ్ణి గురుకులం నుంచి రప్పించి, రాజు తన సలహాదారుగా నియమించుకున్నాడు. రాజ్యంలో చెలరేగిన బందిపోట్ల బెడదను, సేనాధిపతి నరేంద్రదేవుడు అరికట్టలేక పోయాడు. దొంగలను పట్టే బాధ్యతను రాజు ఆదిత్యుడికి అప్పగించాడు. ఆదిత్యుడు ఉపాయంతో దొంగలను పట్టి బంధించాడు. వాళ్ళను కారాగారానికి నడిపిస్తూండగా వాళ్ళలో వీరభద్రుడు ఉండడం ఆదిత్యుడు గుర్తించాడు.


ఆదిత్యుడు తనఏకాంతమందిరంలో తీవ్రంగా ఆలోచించసాగాడు. వీరభద్రుడన్న మాటలు అతని మనసులో పదే పదే ప్రతిధ్వనించసాగాయి.
"నేనెప్పుడైనా దేశప్రజలకు ద్రోహం తలపెట్టానా? వీరభద్రుడు అలా అనడానికి కారణం ఏమైఉంటుంది?"
అంగరక్షకుడు లోపలికి వచ్చాడు.
"ప్రభూ! తమ దర్శనం కోరుతూ ఒక యువతి వచ్చింది!"
"లోపలికి పంపించు!"


"నా పేరు అరుణ!"
ఒక యువతి లోపలికి రావడంతో ఆదిత్యుడు లేచి నిలబడ్డాడు.
"అరుణ?"
"కూర్చోండి!"
ఆదిత్యుడు ఆమెకు ఆసనం చూపాడు.


"నేను కొన్ని సంవత్సరాలు గురుకులంలో గడిపిన విషయం నీకు తెలుసనుకుంటాను. మా తండ్రి మరణానంతరమే రాజుగారు నన్ను పిలిపించారు."
"అలాగా!"
"అవును. ఆ విషయం నాకు తెలుసు. అయితే, మీ తండ్రి మరణించిన రాత్రే, మా నాన్న కూడా మరణించాడన్న విషయం నీకు తెలిసి ఉండదు. మీ తండ్రీ,మా తండ్రీ మంచి స్నేహితులు. ఇద్దరూ కలిసి చదరంగం ఆడేవారు."


"నేను ఒక్కోసారి మా తండ్రి వెంట వెళ్ళేదాన్ని. అప్పుడు మీ తండ్రి నాకు చదవడానికి పుస్తకాలు ఇచ్చేవారు. వాటిలో ముఖ్యంగా ఆయుర్వేద గ్రంథాలు ఎక్కువగా ఉండేవి."


"ఆ దుర్ఘటన జరిగిన రాత్రి కూడా వాళ్ళిద్దరూ చదరంగం ఆడారు. ఆ తరవాత కొంతసేపటికి, విషానికి ఏదైనా విరుగుడు తెలియజేయమని మీ తండ్రి నాకు కబురు చేశారు."


"నేను వెంటనే ఆయన దగ్గరికి వెళ్ళాను. అయితే, అప్పటికే అంతా ముగిసిపోయింది."


''నేను అప్పుడు అక్కడవుంటే బావుండేది కదూ!''


''మా నాన్న పరితపించిపోయాడు. రాజు దగ్గరికి పరిగెత్తాడు. కాని మార్గ మధ్యంలోనే పాముకాటుకు గురయ్యాడు.''


''ఈ విషయాలన్నీ ఎరిగిన మరొక ఏకైక వ్యక్తి వీరభద్రుడు. అయితే, అతడు కూడా ఆ తరవాత కనిపించకుండా పోయాడు. ఆయన అదృశ్యం కూడా నిగూఢంగానే ఉన్నది.''
''వీర భద్రుడు?''


''మీ తండ్రి స్పృహకోల్పోయే ముందు ఏవో కొన్ని మాటలు పలికాడు.''


''అవి నాకు అర్థం కాలేదు. అయినా, ఆ మాటలను అలాగే తాళపత్రం మీద రాసి ఉంచాను.''


ఆదిత్యుడు ఆమె నుంచి తాళపత్రాన్ని అందుకుని చదవసాగాడు.


''ఓ సూర్యుడా! లెమ్ము! చంద్రుడికి భయంకరమైన గ్రహణం పట్టనున్నది... ప్రభువు నిస్సహాయుడు. పాము పడగ విప్పి కాటు వేయకముందే నాయనా, మేలుకో!''


మరొక సంగతి చెప్పడం మరిచాను....
ఈ విషయం నీకు తప్ప మరెవ్వరికీ తెలియనివ్వరాదని హెచ్చరించాడు.


తనలోని భావోద్వేగాల్ని అదుపు చేయడానికి ప్రయత్నిస్తూ ఆదిత్యుడు మాట మార్చాడు.


"మా తండ్రి మేటి చదరంగం ఆట గాడేనా?"


"ఆయనా, మా నాన్నా ఒకరికొకరు తీసిపోకుండా ఆడేవారు."


ఆ నాటి రాత్రి ఇంకా ఏదైనా జరిగిందా?"


"ఆయన ఒక పెట్టెకేసి చూపాడు. దానిని నేను నాతో తీసుకు వెళ్ళాను. అది ఇక్కడే ఉన్నది."


ఆదిత్యుడు పెట్టెను తెరిచి చూశాడు. అందులోని పుస్తకాన్ని వెలికి తీశాడు.




"ఆహా! మా తండ్రి స్వదస్తూరీతో రాయబడింది!"
ఆదిత్యుడు పుస్తకం చదవడంలో లీనమైపోయాడు.


మావంశ రక్షకుడు గరుడుడికి నమస్కారాలు! తన సవతితల్లి కద్రువకూ, ఆమె కొడుకులైన నాగులకూ సేవలు చేయవలసిన నిర్బంధం గరుడుడికీ, ఆయన తల్లి వినతకూ ఏర్పడింది. ఒకనాడు గరుడుడి వీపుపై నుంచి నాగులు జారి కింద పడ్డారు. వాళ్ళకు కోపం వచ్చింది.
–ఇంకావుంది.

# మనదేశం గురించి తెలుసుకుందాం!

## క్విజ్

మన పత్రికలో వెలువడుతూన్న కథలలో పలువురు సాధువులు,సన్యాసులు,మునులు, భక్తులు మొదలైన వారిని గురించి మీరు చదివే ఉంటారు. అటువంటి వారిలో మీకు ఎందరు గుర్తున్నారో ఇప్పుడు చూద్దాం:

1. మన దేశానికి చెందిన ఒక యువరాణి రాజభోగాలను త్యజించి శ్రీకృష్ణుడి భక్తురాలయింది. ఆమె ఎవరు?
2. ఒక భక్తకవి కృష్ణలీలలను కీర్తిస్తూ ఎల్లప్పుడూ భక్తిగీతాలు ఆలపించేవాడు. ఆయన అంధుడు. ఆయన ఎవరో మీకు తెలుసా?
3. బెంగాలు ప్రాంతంలో భక్తి ఉద్యమాన్ని ప్రచారం చేసిన సాధువు ఎవరు?
4. ఆదిశంకరులు ఐదు ప్రాంతాలలో మఠాలను స్థాపించాడు. అవి ఎక్కడెక్కడో మీకు తెలుసా?
5. సుబ్రహ్మణ్యస్వామి భక్తురాలయిన తమిళ కవయిత్రి ఎవరు?
6. మతాలన్నీ సమానం అని విశ్వసించిన గొప్ప ముస్లింభక్తుడు ఎవరు?
7. అహ్మద్‌నగర్ సమీపంలో—హిందువులూ, ముస్లింలూ సమానమైన భక్తి శ్రద్ధలతో కొలిచే సాధువు ఎవరు?
8. విష్ణుభక్తితో పాటు అపూర్వమైన మానవత్వాన్ని ప్రబోధించిన ఒక సుప్రసిద్ధ మతాచార్యుడు శ్రీపెరుంబుదూరులో జన్మించాడు. ఆయన ఎవరు?

### ఫిబ్రవరి క్విజ్ సమాధానాలు:

1. రజీయా సుల్తానా. ఆమె నాలుగేళ్ళు పరిపాలించింది.
2. మదర్ థెరీసా.
3. ప్రధాని ఇందిరా గాంధీ.
4. రాజకుమారి అమృత్‌కౌర్. ఆరోగ్యశాఖను నిర్వహించింది.
5. కేప్టన్ లక్ష్మి.
6. డా.అనీబిసెంట్.
7. నర్గీస్ దత్.
8. ఎం.ఎస్.సుబ్బలక్ష్మి.
9. అరుంధతీరాయ్ ('ది గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్').
10. ఆశాపూర్ణాదేవి. బెంగాలీ నవల 'ప్రథమ్ ప్రతిస్మృతి'.
11. అమృతా షేర్ గిల్.
12. లతా మంగేష్కర్. చలన చిత్రాలకు ఎక్కువ పాటలు పాడారు.




# అనుకోని విజయం!

కపిశానగరంలో మాధవశర్మ అనే మహా పండితుడు ఉండేవాడు.ఆయన పాండిత్యంగురించి చుట్టుపక్కల గొప్పగా చెప్పుకునేవారు. పైగా ఆయనధనసంపన్నుడుకూడానూ.ఆయనకు పరిమళ అనే అందమైన కుమార్తె ఉండేది. ఆమె కూడా మంచి తెలివి తేటలు గలది. బాగా చదువుకున్నది.తండ్రికి ఆమె అంటే ఎంతో వాత్సల్యం.

పరిమళ తెలివిగలది గనకనూ, భాగ్యవంతుడి కూతురు గనకనూ చుట్టుపక్కల నుంచే కాకుండా దూరప్రాంతాల నుంచి కూడా ఎందరో యువకులుఆమెనుపెళ్ళాడ గోరి వచ్చేవారు. పరిమళ మెల్లగా వారిని ఏదో చర్చలోకి దింపి, తాను వేసే ప్రశ్నలకు వారు సమాధానం చెప్పలేరని నిరూపించి పంపేస్తూ ఉండేది. తన ప్రశ్నలకు సరైన సమాధానం చెప్పగలవాణ్ణేతాను పెళ్ళాడాలని ఆమె ఉద్దేశం.

ఆ నగరంలోనే రాధాకాంతుడనే ఒక నిరుపేద యువకుడుండేవాడు. అతని తండ్రి భిక్షాటన చేసిఅతికష్టంమీద కుటుంబపోషణ చేసేవాడు. రాధాకాంతుడు బాల్యం నుంచే మంచి తెలివితేటలు గలవాడు. అతనికివిద్య మీద అమితమైన ఆశ ఉండేది. చాలామంది గురువులకు శుశ్రూష చేసి చాలా జ్ఞానం సంపాదించాడు. కాని అతని జ్ఞానదాహం మాత్రం తీరలేదు. దేశమంతా తిరిగి ఉద్దండ పండితుల వద్ద చేరి, మరింత జ్ఞానం సంపాదించాలని అతని ఉద్దేశం. ఏం చేయడమా అని చాలారోజులు తీవ్రంగా ఆలోచించి, అందుకు ధనసహాయం చేస్తాడేమోనన్న ఆశ కొద్దీ అతడు మాధవశర్మ ఇంటికి వచ్చాడు.

అతను కూడా తనను పెళ్ళాడగోరి వచ్చిన యువకుడేనని భ్రమపడి పరిమళ అతన్ని మెల్లగా మాటలలోకి దింపి, "నాకు కొన్నాళ్ళుగా ఒక అనుమానం. నువ్వు తీర్చగలవా?" అని అడిగింది.

"ఏమిటా అనుమానం?" అన్నాడు రాధాకాంతుడు ఉత్సాహంగా.

"ఈ లోకంలోనూ, పై లోకంలోనూ కూడా సుఖపడేది ఎవరు? కష్టపడేది ఎవరు?" అని పరిమళ అడిగింది.

"ఈ లోకంలోనూ,పైలోకంలోనూ కూడా సుఖపడేవాడు సన్యాసి. అతనికి సంసార తాపత్రయాలేవీ ఉండవు. ఏ చెట్టు కింద నైనా నిశ్చింతగా పడుకుంటాడు. దొరికినది తింటాడు. ఆశలు లేనివాడు గనక ఎప్పుడూ నిరాశకు గురికాడు. ఈవిధంగా ఈ లోకంలో సుఖంగా జీవించి,బంధవిముక్తుడై పైలోకానికి పోయి, అక్కడా సుఖపడతాడు. ఈ లోకంలోనూ,పైలోకంలోనూ కూడా కష్టపడే వాడు బిచ్చగాడు. దరిద్రుడైన వాడి ఇహలోక జీవితమంతా కష్టాలతోనే గడుస్తుంది.ఎండకు ఎండుతాడు; వానకు తడుస్తాడు; చలికి వణుకుతాడు. వాడి కాలమంతా కడుపు నింపుకునే ప్రయత్నంలోనే గడుస్తుంది. ఆ కడుపు ఏనాడూ నిండదు. నానా కష్టాలు అనుభవిస్తాడు. బతికి ఉన్నంత కాలమూ మరొకడికి చిన్నమెత్తు ఉపకారం చెయ్య లేనందున పైలోకంలో కూడా వాడికి ఏవిధమైన సుఖమూ ఉండదు," అన్నాడు రాధాకాంతుడు.

అతను చెప్పిన సమాధానంతో తృప్తిపడి పరిమళ అతన్ని పెళ్ళాడదామని మనసులో తీర్మానించుకున్నది.

అయితే, రాధాకాంతుడి మనసులో పెళ్ళి ధ్యాస ఏమీలేదు. అతను వచ్చింది అందు కోసం కాదు. అతను మాధవశర్మను ధన సహాయం కోరదామని వచ్చాడు.



ఇంతసేపు పరిమళతో మాట్లాడిన మీదట అతనికి పరిమళ సహాయంతో ఆమె తండ్రి మాధవశర్మ నుంచి ఎలాగైనా ధన సహాయం పొందవచ్చునన్న ఆలోచన కలిగింది

వెంటనే అతను పరిమళతో, "నేను ఇప్పుడు నిన్ను మరొక ప్రశ్న వేస్తాను. దానికి నువ్వు సరైన సమాధానం చెప్పలేని పక్షంలో, మీ నాన్నగారి చేత నాకు కొంత ధన సహాయం చేయించాలి," అన్నాడు.

పరిమళ అందుకు సరే అన్నది.

"ఈ లోకంలో సుఖపడి, పైలోకంలో కష్టపడే వాడెవడు? అదేవిధంగా ఈ లోకంలో కష్టపడి, పైలోకంలో సుఖపడే వాడెవడు?" అని రాధాకాంతుడు పరిమళను అడిగాడు.

పరిమళ కొంచెంసేపు మౌనంగా ఆలోచించి, "ఈ లోకంలో సుఖమూ, పైలోకంలో కష్టమూ పొందేవాడు దుర్బుద్ధిగల ధనికుడు. అతను ప్రతిక్షణం ధనార్జన ఒక్కటే పరమ ధ్యేయంగా ఉంటాడు. అతను డబ్బుసంపాదించటం కోసం ఏ పాతకానికైనా ఒడిగట్టుతాడు; అమాయకులూ, బలహీనులూ అయిన ఎంతమంది సుఖాన్నయినా బలి పుచ్చుకుంటాడు. ఇలా బతికినవాడు పై లోకంలో సుఖపడడు. ఈ లోకంలో కష్టపడి, పై లోకంలో సుఖపడేవాడు యోగి. అతను ఈ లోకంలో సమస్త సుఖాల్నీ తృణప్రాయంగా విసర్జించి, సదాసర్వవేళలా పరమార్థ చింతనతో శరీరాన్ని తపింపజేసి, చచ్చిపోయి ఉత్తమ లోకాలను చేరుకుంటాడు," అన్నది.

తన ఆశయం నెరవేరనందుకు రాధాకాంతుడు ఆమె సమాధానం విని చిన్నబుచ్చుకున్నాడు.

ఇంతలో మాధవశర్మ అక్కడికి వచ్చి, "నాయనా,మా అమ్మాయి అడిగిన దానికి సరి అయిన సమాధానం చెప్పావుట. ఆమె ఎంతో సంతోషించి నిన్ను పెళ్ళాడటానికి ఒప్పుకున్నది. నీకు కూడా సమ్మతమైతే మీ కిద్దరికీ పెళ్ళి చేసేస్తాను," అన్నాడు.

ఆ మాట విని రాధాకాంతుడు మొదట నిర్ఘాంత పోయాడు. ఆ తరవాత తేరుకుని తనకు అనుకోని విధంగా కార్యం సిద్ధించినందుకు సంతోషించి, అతను పరిమళను పెళ్ళాడటానికి తన సమ్మతి తెలిపాడు.



# బలం - లంచం!

ఒక రోజున పక్క పక్కపొలాల రైతులైన భూషయ్యా, పశుపతీ అనేవాళ్ళకు, పంటపొలానికి నీళ్ళుపెట్టు కునే విషయంలో తగాదా వచ్చింది. అలా మాటామాటా పెరిగి చివరకు భూషయ్య, పశుపతిని ఎడాపెడాకొట్టాడు. భూషయ్య బలవంతుడు; పశుపతి బక్కచిక్కిన మనిషి.

పశుపతి పొలం నుంచి ఊరికేసి బయలుదేరుతూ, "ఒరే, భూషయ్యా , బలంగలవాడివి గనక, నన్ను కొట్టగలిగావు. చూడు, నిన్ను గ్రామాధికారికి చెప్పి చర్మం వలిపిస్తాను, న్యాయం గెలుస్తుంది!" అన్నాడు.

"న్యాయం గెలవడమేమిటి! ఇప్పుడేం గెలిచింది?" అంటూ భూషయ్య పకపకా నవ్వేశాడు.

పశుపతి సరాసరి గ్రామాధికారి దగ్గరకు వెళ్ళాడు. ఆ గ్రామాధికారి పరమ లంచగొండి. ఎవరు ఎక్కువ లంచమిస్తే,వాళ్ళకు అనుకూలంగా తీర్పులిస్తూండేవాడు.

పశుపతి, అతడికి జరిగింది చెప్పి, "అయ్యా, ఆ భూషయ్య అన్యాయంగా నన్ను కొట్టడ మేకాక, బలమే గెలుస్తుందంటూ, హేళన చేశాడు," అన్నాడు కళ్ళనీళ్ళ పర్యంతమైపోతూ.

ఇది విని గ్రామాధికారి చిరునవ్వు నవ్వి, "నువ్వూ, ఆ భూషయ్యా ఒట్టి అమాయకులు!" అంటూ జేబులోంచి ఒక రూపాయితీసి, ముందున్న బల్లమీద మోగిస్తూ, "యాభై!యాభై!" అన్నాడు.

సంగతి అర్థమైన పశుపతి, గ్రామాధికారికి చేతులు జోడించి నమస్కరించి, మారుపల క్కుండా ఇంటిదారి పట్టి, "అక్కడ పంట పొలాల దగ్గర బలం గెలిచింది; ఇక్కడ గ్రామాధికారి న్యాయపీఠం ముందు డబ్బు గెలుస్తుంది! ఏది ఏమైనా, ఇరుగు పొరుగులతో గొడవలు వచ్చినప్పుడు శాంతంగా సర్దుబాటు చేసుకోవడాన్ని మించిన న్యాయం మరి వుండదు," అనుకున్నాడు.





వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డు పైన రాసి ఈ నెల 25వతేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు మే 2001 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ -600 097.

## అభినందనలు

జనవరి 2001 నెల సంచికలో బహుమతి
పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
పి.పవన్‌కుమార్ S/o పి.విశ్వనాథ్
స్టేట్ బ్యాంక్ ఆఫ్ మైసూర్, ఆర్.సి.బ్రాంచ్,
ఎస్.ఎన్.పేట, బళ్ళారి - 583101 (కర్ణాటక)

బహుమతి పొందిన వ్యాఖ్యలు



నాటి వెలుగులు చీకటిలో!
నేటి దివ్వెలు ముంగిటిలో!!

# చక్రగోల్డ్ టీ బంగారు భవిష్యత్తు ఆఫర్

## గెలుచుకోండి

**40**
కంప్యూటర్లు లేక
24 క్యారట్ బంగారు నాణాలు



CHAKRA GOLD TEA
SCHOLARSHIP
RS. 1000

**1000**
స్కాలర్‌షిప్పులు
ఒక్కొక్కటి
రూ. 1000 విలువ చేసేది

**1**



టీ కొనండి
ప్మైన పాకెట్
రను అందుకోండి.
ా ఎంట్రీ ఫారంతో సహా

**2**




చూపెట్టబడినట్లుగా
యొక్క ఈ భాగాన్ని
అంటించండి

**3**



రంను మీకు
న్న కలెక్షన్ బాక్స్‌లో
లేదా శ్రీమతి ఉమా మాధవన్,
టీ, పి.బి. నం. 2279,
రు - 560 022కు
యండి.

Contents: Tea
TATA TEA LIMITED
1, Bishop Lefroy Road,
Calcutta 700 020
BEST BEFORE WITH 12 MONTHS FROM THE DATE OF PACKAGING.

Net weight 250g
M.R.P. Rs. Incl. of all taxes 47.00
Packed Code No. : A 01/2001

CHAKRA GOLD TEA
GOLDEN TASTE

ంబం కోసం, మీ పిల్లల భవిష్యత్తు కోసం మీరెంతగా శ్రమిస్తారో మాకు తెలుసు. నిజానికి మీదెంతో
ప్మైన శ్రమ. అందుకే మరి, మా మెచ్చుకోలుకి చిహ్నంగా చక్రగోల్డ్ అందిస్తోంది మీ కోసం ఓ అద్వితీయ
- చక్రగోల్డ్ వారి బంగారు భవిష్యత్తు ఆఫర్. కేవలం మూడు చర్యలు చేపట్టండి. మీ పిల్లలకోసం
భవితవ్యాన్ని సృష్టించుకోండి.

టాటావారి
చక్ర గోల్డ్ టీ
బంగారు రుచి



